# పతంజలి యోగ దర్శనము
## నాలుగవ పాదము – కైవల్య పాదము




<u>ప్రవచన కర్త</u>

**డా. శ్రీ కుప్పా విశ్వనాధ శర్మ గారు**

<u>సంకలనము</u>

**వేలూరి అన్నప్ప శాస్త్రి**

విశ్లేషకులు

ప్రొఫెసర్ శ్రీ కుప్పా విశ్వనాథ శర్మగారు



గురుదేవులకు వందనములతో

## శ్రీ గురు ప్రార్థన

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥**

## శ్రీనివాస ప్రార్థన

**శ్రీవేంకటేశః శ్రీశ్రీనివాసః శ్రీలక్ష్మీపతిరనామయః ।**
**అమృతాంశో జగద్వంద్యః గోవిందశ్శాశ్వతః ప్రభుః ॥**

## పతంజలి ప్రార్థన

**యోగేన చిత్తస్య పదేన వాచాం, మలం శరీరస్య చ వైద్యకేన ।**

**యోపాకరోత్తం ప్రవరం మునీనాం, పతంజలి ప్రాంజలిరానతోస్మి ॥**

**నమో హిరణ్యగర్భాదిభ్యః, యోగ విద్యాసంప్రదయకర్తృభ్యః ।**
**వంశర్షిభ్యః నమోమహద్భ్యః, గురుభ్యః ॥**

## 1. జన్మౌషధిమంత్రతపఃసమాధిజాః సిద్ధయః

**జన్మ ఔషధి మంత్ర తపః సమాధిజాః సిద్ధయః** - మూడవ పాదములో వివరించిన సిద్ధులను (విభూతులను) ఈ సూత్రములో విభాగము చేస్తున్నారు. ఆ సిద్ధులు ఐదు భాగములుగా విభజించారు –

**1. జన్మ** – క్రిందటి జన్మలో చేసుకున్న సాధన యొక్క ఫలితము, మరుసటి జన్మ కలిగిన వెంటనే కలిగే సిద్ధులు. జన్మ సిద్ధిని మూడు రకములుగా విభాగము చేసుకోవచ్చు. **(a)** ఈ లోకములో సత్కర్మలు చేసుకున్నప్పుడు, ఆ సత్కర్మలకు ఫలితములను అనుభవించుటకు, ఈ లోకమును విడిచిపెట్టి, పై లోకములలో జన్మించినప్పుడు, ఆ లోకములలో ఫలితములను అనుభవించుటకు కలిగే సిద్ధులను జన్మ సిద్ధులు అంటారు. **(b)** ఈ జన్మలో కొంత సాధన చేసుకొని, ఆ సాధనకు ఫలితములను అనుభవించకుండా, ఆ జన్మను చాలించవలసి వచ్చినప్పుడు, ఈ లోకములో మరొక కొత్త జన్మ కలిగిన వెంటనే, క్రిందటి జన్మలో చేసుకున్న సాధన యొక్క ఫలితము కలుగుతుంది. **(c)** ఈ జన్మలో సాధన పూర్తి అయిన తరువాత, కొన్ని దైవ కారణముల వలన మరికొన్ని జన్మలు తీసుకోవలసి ఉంటుంది (కపిల మహర్షి, సనక (పురాతన), సనాతన (ఆనందము), సనందన (నిత్యమైన), సనత్కుమార (నిత్య కుమార) మొదలైన మహాత్ములు). వీరికి గత జన్మలలో

చేసుకున్న సాధనముల ఫలితములు, పుట్టిన వెంటనే కలుగుతాయి.

**2. ఔషధి** – కొన్ని రకముల ఔషధముల (రసాయనములు) ద్వారా కలిగే సిద్ధులు. మండూక రస అంజనము – కళ్లకు రాసుకుంటే దాగి ఉన్న వస్తువులు, పాతరలు కనిపిస్తాయి.

**3. మంత్ర** – "**మననాత్ త్రాయతే ఇతి మంత్రః**" – మంత్రములను మనస్సులో నిరంతరము మననము చేసుకుంటే, ఆ మంత్రము అతనిని రక్షిస్తుంది. మంత్రములను మననము లేదా జపించటము ద్వారా కలిగే సిద్ధులు. గురువుల ద్వారా మంత్రమును ఉపదేశము పొంది, గురువు చెప్పిన నియమములు పాటిస్తూ (శరీరమును, మనస్సుని, నోటిని పవిత్రము చేసుకొని), ఏకాగ్రతతో ఆ మంత్రములను మానసికముగా జపిస్తే, ఆ మంత్ర దేవత ఆ సాధకుడికి కొన్ని సిద్ధులను కలగచేస్తుంది. **ఉదాహరణ** – వాల్మీకి మహర్షికి **"రామ"** నామము జపించుట ద్వారా సిద్ధులు కలిగాయి.

**4. తపః** – తపస్సులు (శారీరక, మానస, వాచక తపస్సులు) ద్వారా కలిగే సిద్ధులు.

**5. సమాధి** – యోగాంగములలో చివరిదైన సమాధి (సంయమము) ద్వారా కలిగే సిద్ధులు.

**ఉపోద్ఘాతము** – **"వక్తవ్యమర్థం బుద్ధౌ నిధాయ తదర్థమర్థాంతర కథనమ్"** – చెప్పదలచుకున్న ప్రధాన విషయమును బుద్ధిలో ఉంచుకొని, ఆ విషయము శ్రోతలకు సులభముగా అర్థమయ్యేందుకు దానికి కావలసిన పూర్వ రంగము గురించి ప్రస్తావించుట.

**ప్రసంగము – "స్మృతస్య ఉపేక్షా అనహరత్వమ్ ప్రసంగః"** – ప్రధానమైన విషయము గురించి చెప్పుతున్నప్పుడు, ఆ ప్రధానమైన విషయమును బలపరచేందుకు, ప్రధానమైన విషయమునకు సంబంధించిన మరొక ముఖ్యమైన విషయమును చెప్పటము.

**<u>ఉదాహరణ:</u>**

**మార్కండేయ పురాణము** – మను చరిత్ర – అరుణాస్పదము అనే ఊరులో ప్రవరుడు (తెలుగులో ప్రవరాఖ్యుడు అని ఉంది. కాని ఆయన అసలు పేరు ప్రవరుడు – శ్రేష్ఠులలో శ్రేష్ఠుడు) అనే బ్రాహ్మణోత్తముడు ఉండేవాడు. అతడు గృహస్థాశ్రమ ధర్మములు, మూడు పూటలు సంధ్యావందనము నిత్య అగ్నిహోత్ర ఆరాధన, దేవత అర్చన, వేద అధ్యయనము, శిష్యులకు పాఠములు చెప్పటము, తల్లితండ్రులు సేవ, అతిథి సేవలు చేస్తూ చక్కగా వైదిక జీవన విధానము అనుసరిస్తున్నాడు. ఏ విధమైన ఆశలు, దోషములు లేవు. కాని దేశములో ఉన్న పుణ్య

క్షేత్రములు, పుణ్య తీర్థములు చూడాలని ఒక చిన్న కోరిక మనస్సులో ఉంది. కాని నిత్య అగ్ని హెూత్ర ఆరాధన, తల్లితండ్రులు సేవ వలన ఎక్కడికీ వెళ్ళాడు, వెళ్లాలని అనుకోడు. ఒకరోజు సిద్ధుడు అతిథిగా వీళ్ళ ఇంటికి వచ్చాడు. ప్రవరుడు, ఆయన భార్య ఆ సిద్ధుడికి సేవలు చేశారు. చక్కటి భోజనము పెట్టారు. తరువాత ప్రవరుడు ఆయనను ఏ ప్రాంతము నుండి వచ్చారు?, ఏ, ఏ పుణ్య క్షేత్రములు, పుణ్య తీర్థములు చూశారు?, అక్కడి విశేషములు ఏమిటి? అని అడిగాడు. దానికి ఆ సిద్ధుడు నేను ఈ దేశములో ఉన్న అన్ని పుణ్య క్షేత్రములు, అన్ని పుణ్య తీర్థములు తిరిగి చూశాను. అన్ని విషయములను ఏకరవు పెట్టేశాడు. ఇది విన్న ప్రవరుడికి ఆశ్చర్యము, సందేహము కూడా కలిగింది. మీరు చెప్పే దానికి ఒక జీవితము కూడా సరిపోదు. మీ వయస్సు కూడా అంత లేదు. మీరు ఇన్ని ప్రదేశములు ఎలా తిరగగలిగారు? అని అడిగాడు. దానికి ఆ సిద్ధుడు, నా దగ్గర కొన్ని ఔషధములు (రసాయనములు) ఉన్నాయి. అవి పాదములకు రాసుకుంటే, ఎక్కడికి కావాలంటే అక్కడకు, తలుచుకున్న చోటుకి వెంటనే వెళ్లిపోగలము, అని చెప్పాడు. అప్పుడు ప్రవరుడు, నాకు హిమాలయములలో ఉండే పుణ్య క్షేత్రములను చూడాలని ఉంది. ఆ రసాయనము నాకు కూడా ఇస్తే నేను అక్కడకు వెళ్లి ఆ పుణ్య క్షేత్రములు చూస్తాను కదా, అని అడిగాడు. ఆ సిద్ధుడు, సరే ఇస్తాను అని చెప్పి, తన సంచిలో ఉంది ఒక సీసా తీసి, ప్రవరుడి

పాదములకు ఆ రసాయనము లేపనము పూత రాసి, ఇప్పుడు నీవు తలుచుకున్న చోటుకి వెళ్లిపోవచ్చు అని చెప్పి ఆ సిద్ధుడు వెళ్ళిపోయాడు. ప్రవరుడు ఆనందముతో, నేను హిమాలయములకు వెళ్ళాలి అని అనుకున్నాడు. తక్షణమే అతడు హిమాలయములలో ఉన్నాడు (ఔషధి సిద్ధి). ప్రవరుడు ఆ హిమాలయములలో నారా, నారాయణులు తపస్సు చేసిన ప్రదేశము, శివ పార్వతిల వివాహము జరిగిన క్షేత్రములు, సుందరమైన ప్రదేశములు తిరిగాడు.

సూర్యాస్తమానము సమయము అవుతోంది, ఇంటికి వెళ్లి అగ్ని హోత్రము, తల్లిదండ్రులను చూసుకోవాలి అని అనుకొని, నేను నా ఇంటికి వెళ్ళు గాక అని అనుకున్నాడు. కాని అతడు ఎక్కడికీ వెళ్ళలేక, అక్కడే ఉండిపోయాడు. ఏమయింది అని ఆలోచించి, చూసుకుంటే, ఇన్ని చోట్లకి తిరిగిన కారణముగా పాదములకు రాసిన లేపనము అరిగిపోయి, ఊడిపోయింది. ప్రవరుడు దానికి చాలా బాధ పడి, అక్కడ ఎవరైనా మహర్షులు, సిద్ధులు ఉండవచ్చు, వాళ్లను అడుగుదాము అని అనుకొని నడుస్తూ వెళ్ళుతున్నాడు. అతని వరూధిని అనే ఒక గంధర్వ కన్య కనిపించి, ప్రవరుడిని ప్రలోభ పెట్టటానికి ఎంతో ప్రయత్నించింది. ఆమెకు తన విషయము అంతా చెప్పి, నేను మా ఇంటికి వెళ్ళటానికి సహాయము చేయమని అడిగాడు. ఆమె నేను సహాయము చేయను,

నీవు ఇక్కడే నాతోనే ఉండిపో  అని చెప్పింది. దానికి ప్రవరుడు నాకు అలాంటిది ఏమీ వద్దు, నేను ఇంటికి వెళ్ళాలి అని అన్నాడు. ఆమెకు కోపము వచ్చి, నీకు బుద్ధి లేదా అని తిట్టింది. దానికి ప్రవరుడు మాకు ఇలాంటివి ఏవీ నచ్చవు, మాకు అరణిలు (అగ్నిని పుట్టించే కొయ్య ముక్కలు), దర్భలు, అగ్నిహోత్రము మాత్రమే ప్రియము అని కూడా చెప్పాడు.

అప్పుడు ప్రవరుడు అక్కడే కూర్చొని, ఆచమనము చేసి, "నేను నా ధర్మమును శ్రద్ధగా పాటిస్తున్నట్లయితే, నేను అగ్ని హోత్రమును శ్రద్ధగా ఆరాధిస్తున్నట్లయితే, నేను నా తల్లితండ్రులకు శ్రద్ధగా సేవలు చేస్తున్నట్లయితే, ఓ అగ్ని దేవతా నేను ఈ సేవలు చేసుకుందుకు  నన్ను  మా ఇంటికి వెంటనే చేర్చండి", అని ప్రార్థించాడు. తక్షణమే ప్రవరుడు తన ఇంట్లో ఉన్నాడు (తపః సిద్ధి).

## 2. జాత్యంతరపరిణామః ప్రకృత్యాపూరాత్

**జాత్యంతర పరిణామః ప్రకృత్యా పూరాత్** - జీవుడు మానవ జన్మ అంతమై, మరొక  కొత్త జన్మ (పక్షి లేదా చేప) ఎత్తినప్పుడు, ఆ జన్మలో కలిగే శరీరముతో, ఆ జన్మలో కలిగే సిద్ధులను (గాలిలో ఎగురగలిగే లేదా నీటిలో జీవించగల) అనుభవించుటకు తగినట్లుగా పరిణామము చెంది (ఎగురగలిగే పక్షి శరీరముతో లేదా నీటిలో జీవించగల చేప శరీరముతో) జన్మిస్తాడు. దీనిని

జన్మ సిద్ధి అనుకోవచ్చు. మానవ శరీరమును ఉత్పత్తి చేసిన మూల కారణమైన ప్రకృతి (పంచ భూతములు), తరువాత జన్మలో అదే ప్రకృతి (పంచ భూతములు) పరిణామము చెంది, మరొక కొత్త శరీరమును, కొత్త శక్తులతో ఉత్పత్తి చేస్తుంది.

జీవుడు మానవ జన్మ ఎత్తినప్పుడు, ఈ మానవ శరీరముతో పక్షిలా ఎగరలేడు, చేపలా నీటిలో జీవించలేడు. కాని అదే జీవుడు మరో జన్మలలో పక్షిగా పుట్టినట్లయితే ఎగరగలడు, చేపగా పుట్టినట్లయితే నీటిలో జీవించగలడు. జీవుడు ఆ, యా జన్మలలో ఆ, యా శరీరములతో జీవించుటకు తగిన సామర్ధ్యము కలిగి ఉంటాడు. ఈ శరీరములు, ఈ శక్తులు అన్నీ మూల ప్రకృతి (పంచ భూతముల) పరిణామములతో కలుగుతాయి. కాని మిగిలిన నాలుగు రకముల సిద్ధులు ఔషధి, మంత్ర, తపః, సమాధి ఈ జన్మలోనే సాధనలు చేసుకొని కొన్ని సిద్ధులను ఈ జన్మలోనే పొందుతాడు. ఉన్న మానవ శరీరములోనే ఈ సిద్ధులు (కొత్త శక్తులు) కలగాలంటే, ఉన్న శరీరములోనే మూల ప్రకృతి (పంచ భూతముల) పరిణామములు చెంది కొత్త శక్తులను ప్రవేశ పెడతాయి. కొత్త శరీరములో కొత్త శక్తులకు, ఉన్న శరీరములోనే కొత్త శక్తులకు నియమము ఒక్కటే.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-3-1, నుండి 5-10-10 వరకు** – ఆరుణ మహర్షి పౌత్రుడు, గౌతమ మహర్షి పుత్రుడైన శ్వేతకేతువు, జీబలి పుత్రుడైన రాజర్షి ప్రవాహణుడు దగ్గరకు వెళ్లాడు. ప్రవాహణుడు, శ్వేతకేతుడితో మీ తండ్రి దగ్గర అన్ని విద్యలు అభ్యసించావు అని చెప్పావు కదా I నేను నిన్ను ఐదు ప్రశ్నలు వేస్తాను. వాటికి జవాబు చెప్పు అని ఈ విధముగా ప్రశ్నించాడు – 1. సృష్టించబడిన ఈ శరీరములను విడిచిపెట్టి, పైకి వెళ్ళే జీవులందరూ, ఇక్కడి నుండి ఎలా, ఎక్కడికి వెళ్ళుతున్నారు? 2. జీవులు పై నుండి ఈ లోకమునకు ఎలా తిరిగి వచ్చి మరొక జన్మ పొడుతారు? 3. జీవులు పైకి వెళ్ళే మార్గములు దేవయాన మార్గము, పితృయాన మార్గము గురించి వివరములు నీకు తెలియునా? 4. ఇక్కడ నుండి వెళ్ళిన జీవులతో, పై లోకములు ఎందుకు నిండిపోవటలేదు? 5. జీవుడు ఇక్కడి నుండి పైకి వెళ్ళేటప్పుడు తనతో తీసుకువెళ్ళే పంచ భూతములు, ఏ రకమైన మార్పులు చెంది, మళ్ళీ కొత్త శరీరముతో, ఆ శరీరమునకు ఉండే కొత్త పేరుతో ఈ లోకమునకు ఎలా తిరిగి వస్తాడో తెలుసా? అని అడిగాడు. శ్వేతకేతువుకు ఈ ఐదు ప్రశ్నలు అసలు అర్ధము కాలేదు, వాటికి జవాబులు కూడా తెలియవు. శ్వేతకేతువు నాకు తెలియదు అని జవాబు చెప్పాడు. దానికి ఈ ప్రశ్నలకే

జవాబులు తెలియని వాడవు, నేను విద్యను అభ్యసించాను అని ఎందుకు చెప్పావు, అని వెక్కిరించాడు. దానితో శ్వేతకేతువుకు కొంచము మనస్సు నొచ్చుకొని, తండ్రి దగ్గరకు వెళ్లి, జరిగినదంతా వివరముగా చెప్పి, నాకు విద్యను పూర్తిగా నేర్పితిరి అని ఎందుకు చెప్పారు? నాకు ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పండి అని అడిగాడు. దానికి గౌతముడు నాకు కూడా ఈ ప్రశ్నలకు జవాబు తెలియదు. నాకు తెలుసుంటే నేను నీకు ఎందుకు చెప్పను? తప్పకుండా నీకు చెప్పేవాడినే అని అన్నాడు.

మరునాడు గౌతమ మహర్షి రాజర్షి ప్రవాహణుడు దగ్గరకు వెళ్ళాడు. ప్రవాహణుడు గౌతమ మహర్షిని సత్కరించి, గౌతమా । మానవులకు కావలసిన సమస్త సంపదలు నీవు అడగవచ్చు అని అన్నాడు. గౌతమ మహర్షికి కొంచము కోపము వచ్చి, మహారాజా । నీ సంపద నీ దగ్గరే ఉంచుకో. నీవు నా కుమారుడు శ్వేతకేతువును ఐదు ప్రశ్నలు వేశావు. వాటికి సమాధానము నా కుమారుడికి, నాకు కూడా తెలియదు. వాటికి సమాధానము చెప్పు, అని అడిగాడు. ఇది పంచాగ్ని విద్య. ఈ విద్య నాకు మాత్రమే తెలుసు. ఈ విద్యను చాలా కష్టపడి సంపాదించాను. నీకు అంత సులభముగా చెప్పను. నీవు నా దగ్గర సుదీర్ఘ కాలము

ఉండు. నాకు ఎప్పుడు చెప్పాలని అనిపిస్తే అప్పుడు నీకు నేను చెప్పుతాను, అని అన్నాడు. గౌతమ మహర్షి దానికి ఒప్పుకున్నాడు. గౌతమ మహర్షి చాలా కాలము రాజర్షి ప్రవాహణుడు ఉన్నాడు. తరువాత ఒకరోజు రాజర్షి ప్రవాహణుడు గౌతమ మహర్షిని పిలిచి, సమాధానము చెప్పుతాను కూర్చో అని చెప్పి ఈ క్రింద విధముగా చెప్పాడు.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-4-1, 2** – మొదటి అగ్ని ద్యులోకము (అపర లోకము లేదా ఊర్ధ్వ లోకము) అగ్నిగా ఉంటుంది. ఆదిత్య భగవానుడే సమిధ. కిరణములు ధూమము, పగలు జ్వాల, చంద్రుడు, అగ్ని, నక్షత్రములు అన్నీ కిరణములు. ఇంద్రుడు అభిమాన దేవతలు, మానవుడు తన జన్మలో చేసుకున్న కర్మలు అన్నిటినీ "శ్రద్ధ" ఆశనే మూటగా కట్టి ఈ అగ్నిలో ఆ శ్రద్ధను ఆహుతి చేస్తారు. ఆ హవిస్సుల వలన సోమము అనే పదార్థము పుట్టుకొస్తుంది.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-5-1, 2** – రెండవ అగ్ని పర్జన్యుడు (వర్ష దేవత) లేదా ఇంద్రుడే అగ్ని, వాయువు సమిధ. మేఘములు పొగ. మెరుపు జ్వాల (ప్రకాశము). పిడుగు అగ్ని. మేఘ గర్జనలు అగ్ని కిరణములు. దేవతలు ఈ అగ్ని యందు

సోమమును ఆహుతి చేస్తారు.  ఆ పర్జన్యుడు అనే అగ్ని నుండి వృష్టి (వర్షము) పుట్టుకొస్తుంది.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-6-1, 2** - మూడవ అగ్ని పృథివి. సంవత్సరములు సమిధలు. ఆకాశము ధూమము. రాత్రి జ్వాల. దిక్కులు అగ్ని. విదిక్కులు (దిక్కుల మూలలు) కిరణములు. దేవతలు ఈ అగ్ని యందు వర్షమును ఆహుతి చేస్తారు. పృథివి అనే అగ్ని నుండి అన్నము పుట్టుకొస్తుంది.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-7-1, 2** – నాలుగవ అగ్ని పురుషుడు. వాక్కు సమిధి. ప్రాణము పొగ. జిహ్వ (నాలుక) జ్వాల. నేత్రములు అగ్ని. శ్రోత్రములు అగ్ని కిరణములు. దేవతలు ఈ అగ్నిలో అన్నమును ఆహుతి చేస్తారు. ఆ అగ్ని నుండి రేతస్సు పుట్టుకొస్తుంది.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-8-1, 2** – ఐదవ అగ్ని యువతి (స్త్రీ). ఉపస్థ సమిధి. సంకేతము పొగ. యోని జ్వాల. మైథునము అగ్ని. రతి సుఖము కిరణములు. దేవతలు ఈ అగ్నిలో రేతస్సును ఆహుతి చేస్తారు. ఆ అగ్ని నుండి గర్భము (శిశువు) పుట్టుకొస్తుంది. జీవుడు చేసుకున్న కర్మలు, పంచ భూతములతో (ప్రతీకలు – శ్రద్ధ, సోమము, వర్షము, అన్నము, రేతస్సు, గర్భము) కలిసి గర్భముగా (ఒక

శిశువు శరీరముగా) మారతాయి. ఆ శరీరమునకు ఒక పేరు (మొగ పిల్లాడు, ఆడ పిల్ల, కాకి పిల్ల, చేప పిల్ల, కుక్క పిల్ల) సంతరించుకుంటుంది.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-9-1, 2** – ఈ 5 వ ఆహుతి వలన జలము ఈ రీతిగా పురుష (జీవ) సంజ్ఞను పొందుచున్నది.  జరాయువు అనే పలుచని సంచితో చుట్టబడిన ఆ శిశువు (గర్భము) 9 లేదా 10 నెలలు మాతృ గర్భములో ఉండి తరువాత జన్మించును. జన్మించిన ఆ శిశువుకు ఒక పేరు ఏర్పడుతుంది. ఆ పుట్టినవాడు వాడి ఆయుస్సు ఉన్నంత కాలము జీవించును. ఆయుస్సు పూర్తి అవగానే, అతను ఏ అగ్నుల నుండి పుట్టాడో, ఆ అగ్నులే వాని, వాని కర్మానుసారము ఆయా లోకములకు తీసుకుపోవును.

జీవులు చేసుకున్న కర్మలు, పంచ భూతములు మిళితమైన, పరిణామములు చెందుతూ, చెందుతూ కొత్త శరీరమును, కొత్త శక్తిని సంతరించుకుంటాయి. దీనినే కొత్త జన్మ అంటారు.

**ఛాందోగ్యోపనిషత్ – పంచాగ్ని విద్య – 5-10-1 ఉంది 7 వరకు** –  ఈ పైన చెప్పిన జ్ఞానము పొందినవారు, ఆయుస్సు పూర్తి అయిన తరువాత ఈ శరీరమును విడిచి, అర్చిరాది (కాంతివంతమైన)

లోకములు పొందుదురు. అచ్చటి నుండి అహర్లోక శుక్లపక్ష ఉత్తరాయణములు, సంవత్సరము, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్ (మెరుపు) మార్గములో వెళ్ళుదురు. అచ్చట అమానుష పురుషుడు ఉండులను. అతడు వారిని బ్రహ్మ లోకము చేర్చును. ఇది దేవయాన మార్గము. భూలోకములో పుణ్య కర్మలు, దాన ధర్మములు చేయువారు, దూమమయ లోకములకు వెళ్ళుదురు. అచ్చట నుండి రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము పితృలోకము, గగన మార్గము, చంద్ర మార్గము, చేరెదరు. (అనగా ఆ, యా అభిమాన దేవతలను చేరెదరు). అక్కడ భోగములను అనుభవించిన తరువాత పుణ్య కర్మలు క్షయము అయిన పిమ్మట ఆకాశము, వాయువు, ధూమము, మేఘము, వర్షము, అన్నము, రేతస్సు, స్త్రీ గర్భము నుండి ప్రాణులుగా పుట్టుదురు. ఎవరైతే పాప కర్మలు చేస్తారో వాళ్ళు, నీచ యోనులలో కుక్క, పంది, జంతువులు, వృక్షములుగా పుట్టుదురు.

**బ్రహ్మ సూత్రములు – తృతీయ అధ్యాయము – ప్రథమ పాదము - 1. తదంతర ప్రతిపత్త్యధికరణము - 1. "తదంతర ప్రతిపత్తౌరంహతి సంపరిష్వక్తః ప్రశ్న నిరూపణాభ్యామ్"** – ఈ అధికరణములో జీవుడు కొత్త, కొత్త శరీరములో ఎలా పొందుతాడు అనే

విషయములను సంపూర్ణముగా వివరించి, కర్మలు, ప్రకృతి (పంచ భూతములు) కలిసి ఏ విధముగా మార్పులు చెంది జీవుడికి కొత్త శరీరములు కలిగిస్తాయో వివరించారు.

పుట్టిన పసిపాప, కొన్ని నెలలకు ప్రాకుతాడు. కొంత కాలమునకు నడుస్తాడు, కొంత కాలమునకు వేగముగా పరుగెత్తుతాడు, ముసలితనము వచ్చిన తరువాత పరుగెత్తలేడు, నడవలేడు కూడా. ఈ శరీరము నిరంతరము పరిణామ శీలము. ఈ విధముగా అదే శరీరములో కొత్త శక్తులు కలుగుతున్నాయి, కొన్ని శక్తులు ఉడిగిపోతున్నాయి. అదే శరీరములో, కొత్త శక్తులలో కలిగే ఈ మార్పులు ప్రకృతి (పంచ భూతముల) మార్పులతోనే కలుగుతున్నాయి. మర్రి విత్తనము చాలా చిన్నదిగా ఉంటుంది. దానిని భూమిలో నాటితే అది పెరిగి, పెరిగి పెద్ద వట వృక్షముగా తయారవుతుంది. అదే విధముగా యోగ సాధన చేసుకున్న యోగి శరీరములో కూడా ప్రకృతి (పంచ భూతముల) మార్పులు కలిగి కొత్త శక్తులు కలుగుతాయి. యోగ సాధనతో యోగజ ధర్మము యోగి శరీరములలో ప్రకృతి (పంచ భూతములలో) మార్పులు తీసుకువచ్చి యోగ శక్తులను కలగచేస్తాయి.

## 3. నిమిత్తమప్రయోజకం ప్రకృతీనామ్ వరణభేదస్తు తతః క్షేత్రికవత్

**నిమిత్తమ్ అప్రయోజకం ప్రకృతీనామ్ వరణ భేదస్తు తతః క్షేత్రికవత్** –

**నిమిత్తమ్ అప్రయోజకం ప్రకృతీనామ్** - యోగజ ధర్మముతో కలగలసిన ప్రకృతి (పంచ భూతములు) తెగి శరీరములో మార్పులు తీసుకువస్తాయి వాస్తవమే. కాని ఇక్కడ యోగజ ధర్మము నిమిత్తము లేదా ఒకానొక కారణము. కాని ప్రధాన కారణముగా చెప్పుకోకూడదు. ఈ యోగజ ధర్మము, ప్రకృతిలో మార్పులు కలిగించలేదు. ప్రకృతి అనుగ్రహముతో పుట్టుకొచ్చిన ఈ యోగజ ధర్మము, ప్రకృతికి సహకారిగా పనిచేయగలదు, కాని ప్రకృతిని నియంత్రించలేదు. ప్రకృతి కారణము, యోగజ ధర్మము కార్యము. కార్యము కారణమును నియంత్రించలేదు.

**వరణ భేదస్తు తతః క్షేత్రికవత్** – పొలమునకు నీరు పెట్టె సమయములో మధ్యలో గట్లు కట్టి మడులు, మడులుగా చేసి మొదటి మడిలో నీరు నిండిన తరువాత, రెండవ మడిలోకి నీరు పోయేందుకు గట్టులో కొంత భాగమును తొలగిస్తే రెండవ మడిలోకి నీరు పారుతుంది. అలాగే మూడవ మడిలోకి ఏలా చేస్తారో, ఆ విధముగానే ఎప్పుడూ మార్పులకు సిద్ధముగా ఉండే ప్రకృతికి (పంచ భూతములకు) జీవుడు చేసుకున్న కర్మలు, పొలములో గట్టులాగ, అడ్డముగా ఉంటాయి. ఆ

అడ్డములను తొలగించుటకు యోగ సాధన, లేదా మంత్రము అనుష్టానము లేదా తపస్సు ద్వారా ఆ అడ్డములను తొలగించుకుంటే, ఆ యోగి శరీరములో అడ్డములు తొలగి మార్పులు ద్వారా కొత్త శక్తులు సంభవిస్తాయి.

జీవుడికి భోగములు (సుఖము, కష్టము) లేదా అపవర్గము (మోక్షము) ఇవ్వటానికి  సంసిద్ధముగా ఉండే, నిరంతరము పరిణామ శీలమైన, ఎప్పుడూ మారటానికి సిద్ధముగా ఉండే  ప్రకృతి, జీవుడు చేసుకున్న కర్మలు అనుగుణముగా, సాధారణ మార్పులు  మాత్రమే (పిల్లవాడు పెద్దవాడు అవుతున్నాడు) కలుగుతాయి. జీవుడు యోగ సాధన లేదా మంత్రము అనుష్టానము లేదా తపస్సు ద్వారా తాను చేసుకున్న అధర్మ కర్మలు, పాపములు అనే కలుపు మొక్కలుగా ఉండే అడ్డంకులను తొలగించుకోగలిగితే, మార్పులకు సంసిద్ధముగా ఉండే ప్రకృతిలో మార్పులు కలిగి యోగ, మంత్ర, తపస్సు యొక్క శక్తులు కలిగిస్తుంది. ప్రకృతి శరీరములో మంచి మార్పులను కలిగించినట్లే, జీవుడు అధర్మ కర్మలు, పాపములు ఎక్కువగా చేసుకున్నట్లయితే, ప్రకృతిలో ఉండే  ధర్మ కర్మలు, పుణ్య కర్మలు  అనే అడ్డంకులను తొలగించి శరీరములో చెడు మార్పులను కూడా కలిగించగలదు.

**<u>ఉదాహరణ:</u>**

**పద్మ పురాణము** – 1. దేవతలు, రాక్షసులు మధ్య జరిగిన యుద్ధములో ఇంద్రుడు వృత్తాసురుడిని సంహరించిన కారణముగా ఇంద్రుడికి బ్రహ్మ హత్యా పాతకము అంటుకుంది. దానిని నివారణకు ఇంద్రుడు ప్రాయశ్చిత్తము చేసుకుందుకు ఇంద్ర పదవి వదిలి తపస్సుకు వెళ్ళిపోయాడు. 100 అశ్వమేధ యాగములు చేసిన, దత్తాత్రేయ స్వామికి సేవ చేసి ఆయన అనుగ్రహము పొందిన, ధర్మముగా రాజ్యపాలన చేస్తున్న, గొప్ప పరాక్రమము కలిగిన నహుష మహారాజు ఇంద్ర పదవికి అర్హుడు అని దేవతలు నిర్ణయించి, నహుషుడిని ఇంద్ర పదవి ఇచ్చారు. ఆ తరువాత నహుషుడిని పొగిడే వాళ్ళు ఆయన చుట్టూ చేరి, నహుషుడిని పొగుడుతూ ఉంటే, ఆయనకు అహంకారము పెరిగి, ఇంద్రుడి భార్య శచీదేవి మొహములో పడి, శచీదేవిని ఇంద్రుడు వదిలేశాడు, తాను ఇంద్ర పదవిలో ఉన్నాడు కాబట్టి, శచీదేవి తనకు భార్య అవుతుంది, అని ప్రకటించి, అందుకు ఆమెను చూచుటకు సప్త ఋషులతో పల్లికి మోయించుకొంటూ వెళ్ళుతూ, పల్లకిని వేగముగా తీసుకువెళ్లట లేదని అగస్త్య మహర్షిని ఎడమ కాలుతో తన్నుతూ “సర్ప”, సర్ప (త్వరగా వెళ్ళు, త్వరగా వెళ్ళు) అని అన్నాడు. దానికి అగస్త్య మహర్షికి కోపము వచ్చి “నన్ను సర్ప

అన్నావు కాబట్టి, నీవు తక్షణమే సర్పము (కొండచిలువ) అవుగాక" అని శపించాడు. ఎంతో పుణ్యము చేసుకొని, అంతటి గొప్ప ఇంద్ర పదవిలో ఉండే శరీరమును సాధించిన నహుష మహారాజు యొక్క శరీరము, క్షణములో కొండచిలువ శరీరముగా మారిపోయి భూమి మీద పడ్డాడు. అనగా ఇంద్ర శరీరమునకు కారణమైన ప్రకృతి, కొండచిలువ శరీరముగా మారిపోయింది. ఒకే జన్మలో మహారాజు, ఇంద్ర పదవి, కొండచిలువ అలా మారటానికి కారణము తాను చేసుకున్న పుణ్య, పాప కర్మల ఫలితముల ప్రభావము.

2. బంగారము ముద్ద, కొలిమి, అగ్ని మరియు అన్ని పరికరములు కారణములు ఉన్నా, బంగారు ఆభరణములు వాటంతట అవి తయారవవు. ప్రకృతి పరిణామములకు సిద్ధముగా ఉన్నా, దానంతట అది ఏ పరిణామము చెందదు. ఆ ఆభరణములను తయారు చేయుటకు (ప్రకృతిలో పరిణామము కలుగుటకు) ఒక కంసాలి (కర్త), ఆ ఆభరణమును తయారుచేసే క్రియ (కర్మ) జరిగితేనే ఆ ఆభరణము తయారు అవుతుంది. అలాగే సృష్టిలో కూడా జీవులు తాము చేసుకున్న కర్మలను (పాప, పుణ్యములు) అనుభవించుటకు, ఈశ్వర సంకల్పముతోనే ఈ సృష్టి జరిగింది. ప్రకృతిలో జరిగే మార్పులను చేతనుడైన ఈశ్వరుడు నియంత్రిస్తున్నాడు.

మానవుడు తన (కర్మ) ద్వారానే తన శరీరమునకు కారణమైన ప్రకృతిని తనకి అనుకూలముగా మారుటకు లేదా పరిణామము చెందుటకు ప్రయత్నము యోగ సాధన, మంత్ర అనుష్టానము, తపస్సు) చేసుకోవాలి.

## 4. నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్

**నిర్మాణ చిత్తాన్య అస్మితామాత్రాత్** -

**నిర్మాణ చిత్తాన్య** - యోగి ఒకే సమయములో అనేక శరీరములను ధరించి, ఆ అనేక శరీరములతో అనేక కార్యములు చేయగలిగే సిద్ధిలో, ఆ అన్ని శరీరములలో మనస్సు ఉంటుందా?, ఉండదా? ఆ శరీరములలో మనస్సు లేకపోతే, ఆ శరీరము భోగములను (సుఖము, దుఃఖము) ఎలా అనుభవించగలదు? మనస్సు లేకపోతే శరీరమునకు విలువ ఉండదు గదా? అనే ప్రశ్నలకు మనస్సు లేని శరీరమునకు ఏ ప్రయోజనము ఉండదు. అందుచేత యోగి ఒకే సమయములో ధరించిన సమయములో, ఆ అన్ని శరీరములలో ఒక్కొక్క మనస్సు కూడా తప్పకుండా ఉంటుంది. యోగి ప్రధాన శరీరములో, పరమేశ్వరుడు సృష్టిని సంకల్పించినప్పుడు, ప్రకృతిలో పరిణామము చెంది కలిగిన **మహత్** (జీవుల చేసుకున్న కర్మలు, వాటితో కలిగిన సంస్కారములు

ఉండే సమిష్టి బుద్ధి లేదా మనస్సు) ద్వారా ప్రతి జీవి శరీరములో ఒక సహజమైన ప్రధానమైన మనస్సు ఉంటుంది. యోగిలో ఉండే ఆ సహజమైన ప్రధాన మనస్సు తప్ప, యోగి తన యోగ సిద్ధితో సృష్టించుకున్న మిగిలిన అన్ని శరీరములలో యోగ సిద్ధి ద్వారా నిర్మించుకున్న ఒక్కొక్క మనస్సు చొప్పున ఉంటుంది. ఆ మనస్సులను **"నిర్మాణ చిత్తాని"** (కొత్తగా నిర్మించుకున్న మనస్సులు) అని అంటారు.

**అస్మితామాత్రాత్** – సహజమైన యోగి శరీరములో ఉండే సహజమైన ప్రధాన మనస్సుకు అస్మిత (సాత్త్వికమైన అహంకార తత్త్వము) సహజమైన ప్రకృతి (మూలము). అస్మిత ప్రతి జీవికి వారి, వారి కర్మలతో, సంస్కారములతో ప్రత్యేకమైన ఒక్కొక్క మనస్సును కలిగిస్తుంది. యోగి నిర్మించుకున్న ఇతర శరీరములలో కూడా ఈ అస్మితా తత్త్వము ద్వారా నిర్మాణ చిత్తములు (నిర్మాణ మనస్సులు) ఏర్పడతాయి. ఈ నిర్మాణ చిత్తము ద్వారా ఆ ఇతర శరీరములతో భోగములు (సుఖము, దుఃఖము) అనుభవించగలవు.

**<u>ఉదాహరణ:</u>**

అయోధ్య రాజధానిగా చేసుకొని రాజ్యము పరిపాలిస్తున్న మాంధాత మహారాజుకు ఆయన భార్య

ఇందుమతికి ముగ్గురు కుమారులు, యాభై (50) మంది కుమార్తెలు కలిగారు. ఆ సమయములో సౌభరి మహర్షి నీటిలో 12 సంవత్సరములు గొప్ప చేసి అనేక సిద్ధులతో పాటు కాయ వ్యూహము (అనేక శరీరములను ధరించుట) అనే సిద్ధిని కూడా పొందారు. తరువాత వివాహము చేసుకోవాలని నిర్ణయించుకొని, మాంధాత మహారాజు దగాకు వెళ్లి, నీకు 50 మంది కుమార్తెలు ఉన్నారు కదా, అందులో ఒక కుమార్తెను నాకు ఇచ్చి వివాహము చేయి అని అడిగారు. మాంధాత మహారాజు సౌభరి మహర్షిని చూసి, మనస్సులో ఈయన చాలా ముసలివాడు, ఇన్ని సంవత్సరముల తపస్సుతో శరీరము బాగా చిక్కిపోయి, గడ్డము, జుట్టు అట్టలు కట్టేసి చూడటానికి అసహ్యముగా ఉన్నాడు. నా కుమార్తెలు రాజ భోగములతో పెరిగారు. ఈయనతో అరణ్యములలో, కుటీరములలో ఉండలేరు. నేను కాదంటే ఈయన నాకు ఏమైనా శాపము ఇవ్వచు. నా కుమార్తెలు ఎవ్వరూ ఈయనను చూసి, వివాహము చేసుకుందుకు ఒప్పుకోరు. అప్పుడు నా కుమార్తెలు ఎవ్వరూ ఒప్పుకోలేదు, అందుచేత నేను నా ఏ ఒక్క కుమార్తెను, నీకు ఇచ్చి వివాహము చేయలేను అనే వంక పెట్టుకొని, ఆయన శాపము నుండి తప్పించుకోవచ్చు అనే ఉద్దేశముతో, ఈ విషమ పరిస్థితి తప్పించుకుందుకు, మాంధాత మహారాజు

సౌభరి మహర్షితో “మా ఆచారము, పద్ధతి ప్రకారము కన్య ఏ పురుషుడిని వివాహము చేసుకుందుకు అంగీకరిస్తే, ఆ పురుషుడితోనే  వివాహము చేయాలి. నా 50 మంది కుమార్తెలు మా అంతఃపురములో ఉన్నారు. మీరు మా అంతఃపురములోకి వెళ్లి, నా కుమార్తెలను అడగండి. నా 50 మంది కుమార్తెలలో, ఏ కుమార్తె మీతో వివాహము చేసుకుందుకు ఒప్పుకుంటుందో, ఆమెను మీకిచ్చి వివాహము చేస్తాను” అని చెప్పి తాను తప్పించుకున్నాడు. ఆ 50 మంది కుమార్తెలు ఉన్న అంతఃపురము లోపలి సౌభరి మహర్షి వెళ్లి, ఆ 50 మంది కుమార్తెలతో, మీలో ఎవరైనా నాతో వివాహము చేసుకుంటారా? అని అడిగారు. సౌభరి మహర్షిని చూసి, ఆ 50 మంది రాజ కుమార్తెలు, నేను చేసుకుంటాను, అంటే నేను చేసుకుంటాను అని ఒకళ్ళతో ఒకళ్ళు పోటీపడుతున్నారు (సౌభరి మహర్షి తన యోగ సిద్ధితో ఆ 50 మంది కుమార్తెలకు మాత్రమే నవ యవ్వనుడిగా, నవ మన్మధుడిగా కనిపించాడు). అది చూసిన మాంధాత మహారాజు ఆశ్చర్యపోయి, ఇక చేసేది ఏమీ లేక, తన 50 మంది కుమార్తెలను సౌభరి మహర్షికి ఇచ్చి వివాహము చేశాడు.

కొన్ని రోజుల తరువాత మాంధాత మహారాజు తన కుమార్తెలు ఎలా ఉన్నారో చూద్దామని  వెళ్లి చూడగా, సౌభరి మహర్షి విశ్వకర్మ ద్వారా  తన 50 మంది

భార్యలకు, 50 దివ్యమైన రాజ భవనములను, మాంధాత మహారాజు రాజ భవనముల కంటె ఎక్కువ అందముగా, ఎక్కువ సౌకర్యములతో నిర్మించి, ఒకే సమయములో 50 శరీరములను ధరించి, తన 50 మంది భార్యలతో భోగములను అనుభవిస్తున్నారు. పిల్లల, మనవులు పుట్టిన కొన్ని సంవత్సరముల తరువాత సౌభరి మహర్షి సంసార భోగములలో మునిగిపోయి ఉన్నందుకు పశ్చాత్తాపముతో వైరాగ్యము కలిగి, భార్యలను పిల్లలను, మానవులను వదిలేసి సన్యాసము స్వీకరించి తపస్సు చేసుకొని మోక్షము పొందారు.

కాయ వ్యూహము అనే సిద్ధిని సాధించిన సౌభరి మహర్షి 50 శరీరములలో అస్మిత తత్త్వముతో (సాత్త్విక అహంకార తత్త్వము) ద్వారా ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క మనస్సు (నిర్మాణ చిత్తము) ఉంది.

సాధారణ మానవుడు ఒక శరీరము, ఒక మనస్సుతోనే, ఆ మనస్సుని నిగ్రహించలేక, మనస్సు ద్వారా కలిగే కష్టములను, బాధలను భరించలేకపోతున్నాడు. యోగి ఎన్నో శరీరములను, ఆ శరీరములలో ఒక్కొక్క మనస్సు చొప్పున ఎన్నో మనస్సులు ఉంటే అన్ని మనస్సులను నిగ్రహించుట అసంభవము.

## 5. ప్రవృత్తిభేదే ప్రయోజకమ్ చిత్తమేకమనేకేషామ్

**ప్రవృత్తిభేదే ప్రయోజకమ్ చిత్తమ్ ఏకమ్ అనేకేషామ్** - యోగి తన యోగ శక్తితో నిర్మించుకున్న ఇతర శరీరములలో ఉండే నిర్మాణ చిత్తముల (నిర్మాణ మనస్సుల) క్రియలను, యోగి యొక్క ప్రధాన శరీరములో ఉండే సహజమైన ప్రధాన మనస్సు అధీనములో ఉంటూ, ఆ సహజమైన ప్రధాన మనస్సు చెప్పినట్లుగా నిర్మాణ మనస్సులు ప్రవర్తిస్తాయి.

యోగికి తన ప్రధాన శరీరములో ఉండే సహజమైన ప్రధాన మనస్సు మీద నిగ్రహము సాధించుకున్నాడు కాబట్టి, తన సహజమైన ప్రధాన మనస్సుతో, తాను నిర్మించుకున్న మిగిలిన శరీరములలో ఉండే నిర్మాణ మనస్సులను కూడా నిగ్రహించుకోగలుగుతాడు.

**వేద మాత – "సదా ఏకదా భవతి ద్వివా త్రిధా బహుధా అనేకధా"** – యోగ సిద్ధిని పొందిన యోగి ఎప్పుడూ ఒక శరీరముతో, రెండు శరీరములతో, మూడు శరీరములతో, ఎన్నెన్నో శరీరములతో, అనేక శరీరములతో ఉండవచ్చు.

**పురాణము** - **"ఏకశ్చ ప్రభు శక్త్యావై బహుధా భవతీశ్వరః భూత్వా యస్మాత్తు బహుధా భవత్ ఏకశ్చ పునశ్చ సహ్. తస్మాశ్చ మనసో భేదాః**

**జాయంతే చైెత ఏవహీ ఏకధా సద్వివిధా చైవ త్రిధాచ బహుధా పునః. యోగేశ్వర శరీరాణి కరోతి వికరోతిచ ఏకధా సద్వివిధా చైవ త్రిధాచ బహుధా పునః. ప్రాప్నుయాన్ విషయా కైశ్చిత్, కైశ్చిత్ ఉగ్రమ్ తపశ్చరేత్ సంహరేశ్చ పునఃశ్చాని సూర్యో రశ్మి గడా నివా"** – యోగి ఒక శరీరముతో ఉన్నా, తన యోగ శక్తితో చాలా శరీరములతో కనిపించగలడు. మళ్ళీ తన యోగ శక్తిని ఉపసంహరించుకొని ఒకడిగా కనిపించగలడు. యోగి ఒకడుగా ఉన్నవాడు, రెండుగా అవుతాడు. రెండుగా ఉన్నవాడు, మూడుగా అవుతాడు. ఇలా సంఖ్యను పెంచుకోగలడు. ఆ పెంచుకున్న శరీరములలో వేరు, వేరు మనస్సులను కూడా పెంచుకోగలుగుతాడు. త్వరగా కైవల్యము పొందాలని ఉద్దేశముతో, కైవల్యము పొందుటకు, అడ్డగించే తాను చేసుకున్న కర్మల ఫలములను ఒకే సమయములో అనేక శరీరములతో తొందరగా అనుభవించి, కర్మ ఫలములను పూర్తిగా సమాప్తము చేయుటకు తన యోగ శక్తితో వేరు, వేరు శరీరములను, మనస్సులను సృష్టి చేసుకొని, ఆ శరీరములతో, మనస్సులతో తన కర్మ ఫలితములను తొందరగా అనుభవించుతాడు. తాను సృష్టి చేసుకున్న కొన్ని శరీరములతో, ఒక శరీరముతో చేయగల తపస్సు కంటె ఎన్నో రెట్లు తీవ్రమైన తపస్సు కూడా చేస్తాడు. ఎప్పుడైతే తన కర్మ

ఫలితములను పూర్తిగా అనుభవించి, కర్మ ఫలితములను శూన్యము చేసుకొని, సాధన కూడా పూర్తి చేసుకుంటాడో, అప్పుడు, సూర్యుడు తన కిరణములను ఎంత సులభముగా ఉపసంహరించుకుంటాడో, అంత సులభముగా తాను సృష్టించిన ఇతర శరీరములను, మనస్సులను ఉపసంహరించుకుంటాడు.

**బ్రహ్మ సూత్రములు – నాలుగవ అధ్యాయము – నాలుగవ పాదము - 4. సంకల్పాధికరణము - 8. "సంకల్పాదేవ తుతచ్ఛ్రుతేః" –** ఉపాసన సిద్ధిని పొందినవాడు తన సంకల్ప సిద్ధితో ఏ శరీరము కావాలనుకుంటే, ఆ శరీరమును వాటిలో నిర్మాణ మనస్సులను సృష్టి చేసుకుంటాడు. ఆ మనస్సుల ద్వారా ఆ శరీరములతో పనులను చేయిస్తూ, ఆ పనుల ద్వారా ఫలితములను అందుకుంటాడు.

**జగద్గురువు ఆది శంకరాచార్యుల భాష్యము** – **"ఇమేవ యోగ శాస్త్రే యోగినా అనేక శరీర ప్రక్రియ"** – ఉపాసన సిద్ధిని పొందిన సిద్ధులు తమ ఫలితములను ఏ విధముగా అందుకుంటారో, అదే విధముగా యోగ సాధన చేసిన యోగ సిద్ధులు కూడా అనేక శరీరములను వాటిలో నిర్మాణ మనస్సులను సృష్టి చేసుకొని, వాటితో వారికి కావలసిన ఫలితములను పొందుతారు.

**<u>ఉదాహరణ:</u>**

శంభరాసురుడు అనే రాక్షసుడు దేవతల మీదకు యుద్ధమునకు వెళ్లి ఘోరమైన యుద్ధము చేస్తున్నాడు. దేవతలు ఏమిచేసినా శంభరాసురుడు ఓడిపోవట లేదు. దేవతలు బ్రహ్మ దేవుడు దగ్గరకు వెళ్లి, శంభరాసురుడిని గెలుచుటకు ఏదైనా ఉపాయము చెప్పమని అడిగారు. బ్రహ్మ దేవుడు ఇలా చెప్పాడు. ఏ ప్రాణి అడుగు తీసి అడుగు వేయాలన్నా, ఏ ఆలోచన చేయాలన్నా, ఏ పని చేయాలన్నా, ఏది తెలియాలన్నా వాడి మనస్సులో ఆ విషయముల గురించి సంస్కారములు ఉండాలి. శంభరాసురుడి జన్మ విచిత్రమైనది. వాడి మనస్సులో ఏ సంస్కారములు లేవు. వాడి మనస్సులో ఒక్క యుద్ధము చేయాలనే ఆలోచనే తప్ప ఇంకేమీ లేదు. అందుచేత వాడు యుద్ధము మాత్రమే చేస్తున్నాడు. వాడిలో ఏ కోరిక, ఏ భయము లేదు. ప్రాణులను నడిపించేది ఆ ప్రాణిలో ఉండే సంస్కారములు. అందుచేత మీరు వాడిలో సంస్కారములు కలిగించుటకు, శంభరాసురుడి ఎదురుగుండా మీలో ఒకడు మరొకడిని కత్తితో పొడుస్తున్నట్లు, రెండవవాడు భయపడుతూ నన్ను పొడవద్దు, నా ప్రాణములు పోతాయి, నేను చచ్చిపోతాను అంటూ పరిగెత్తుతున్నట్లు చేయండి. అప్పుడు వాడిలో భయము అనే సంస్కారము

ఏర్పడుతుంది. శంభరాసురుడి ఎదురుగుండా కొంతమంది అప్సరసలు డాన్సరులు చేస్తూ, దేవతలు ఆ అప్సరసలను చూస్తూ ఆనందిస్తూ చప్పట్లు కొట్టండి. అప్పుడు వాడిలో స్త్రీల మీద వ్యామోహము అనే సంస్కారము కలుగుతుంది. అలాగే సంగీతము వినుట, సుఖము కలిగించే భోగములు గురించి వివరిస్తూ శంభరాసురుడిలో అలవాటు చేయండి. అలా వాడిలో సంస్కారములు కలిగిస్తే వాడు తప్పకుండా ఓడిపోతాడు, అని చెప్పాడు. దేవతలు అలాగే చేశారు. శంభరాసురుడిలో క్రమక్రమముగా ఈ సంస్కారములు (Computer Program) ఏర్పడి, ఆ భోగములకు అలవాటు పడ్డాడు. తరువాత శంభరాసురుడు యుద్ధము చేయుటకు వచ్చినప్పుడు, దేవతలు కత్తి పట్టుకోగానే , శంభరాసురుడు బాబోయ్ కత్తి నాకు గుచ్చుకుంటుంది, నేను చచ్చిపోతాను అనే భయము కలిగి యుద్ధము చేయలేక ఓడిపోయాడు. (ఏ సంస్కారములు లేకుండా ఏ జీవికి, ఏ జన్మ కలగదు. శంభరాసురుడు కథ, సంస్కారముల ప్రాధాన్యతను చెప్పుటకు కల్పించినది).

జీవులలో ఎన్నో జన్మజన్మల నుండి క్లేశముల (**అవిద్య** – అజ్ఞానము, భ్రమ, **అస్మిత** – జీవుడికి, మనస్సుకి సంబంధము ఏర్పడి అహంకారము – ఈ శరీరమే నేను అనే భావన, **రాగము** - కోరిక, **ద్వేషము**,

**అభినివేశము** – నేను ఉండాలి అనే భావన) ద్వారా సంస్కారములు ఏర్పడి, ఆ సంస్కారముల ప్రభావములతో ప్రవర్తిస్తూ ఉంటాడు. అడవిలో అప్పుడే పుట్టిన జంతువు (జింక పిల్ల) ఇతర జంతువులను (నక్క, వేటకుక్క, లేదా పులి) చూసి, ఆ జంతువు తనను చంపి తినేస్తుందని భయపడి, కష్టము మీద లేచి నిలబడి పరిగెత్తుతుంది. ఆ జింక పిల్లకు ఆ నక్క లేదా వేటకుక్క, పులి తనను చంపి తింటుందని ఎవరు చెప్పారు? ఆ జింక పిల్లకు ఆ జ్ఞానము, భయము అస్మిత, ద్వేషము, అభినివేశము (ఈ శరీరము నాది, ఈ శరీరమే నేను, నేను ఉండాలి, నేను బతకాలి, నేను చావకూడదు) అనే క్లేశము ద్వారా కలిగిన సంస్కారము. పుట్టిన వెంటనే తల్లి జింక మీద ప్రేమ ఎలా కలుగుతుంది? రాగము అనే క్లేశము ద్వారా కలిగిన సంస్కారము.

మానవులలో చెడు, మంచి సంస్కారములు ఉంటాయి. మొదటి దశలో చెడు సంస్కారములను పోగొట్టుకొని, మంచి సంస్కారములను పెంచుకోవాలి. రెండవ దశలో యోగ సాధన ద్వారా సంస్కారములను, కర్మ ఫలితములను పూర్తిగా శూన్యము చేసుకోవాలి. అప్పుడే కైవల్యము పొందుటకు అర్హత కలుగుతుంది.

## 6. తత్ర ధ్యానజమనాశయమ్

**తత్ర ధ్యానజ అనాశయమ్** - యోగి ప్రధానమైన శరీరములో, సహజమైన ప్రధాన మనస్సుతో ధ్యానము అనే సాధన ద్వారా పరిశుద్ధమైన మనస్సు, ఏ రకమైన సంస్కారములు, వికారములు లేకుండా స్వచ్ఛముగా ఉంటుంది.

కేవలము ఏ మనస్సుతో ధారణ, ధ్యానము, సమాధి (సంయమము) చేశారో, ఆ మనస్సులో మాత్రమే క్లేశములు వాటి ద్వారా కలిగే సంస్కారములు నాశనము అయి పరిశుద్ధముగా ఉంటుంది. యోగికి సమాధి ద్వారా కలిగిన సిద్ధితో, అనేక శరీరములను, ఆ శరీరములలో నిర్మాణ మనస్సులను సృష్టి చేసినప్పుడు, ఆ యోగి యొక్క సహజమైన ప్రధాన మనస్సులో ధ్యాన ప్రక్రియ జరిగింది కాబట్టి, ఆ సహజమైన ప్రధాన మనస్సు మాత్రమే పరిశుద్ధమై కైవల్యము పొందుటకు అర్హత కలిగి ఉంటుంది. ధ్యానము చేసిన మనస్సుకు మాత్రమే క్లేశములు, సంస్కారములు అంటవు. మిగిలిన నిర్మాణ మనస్సులను, క్లేశములు, సంస్కారములు లేని పరిశుద్ధమైన సహజమైన ప్రధాన మనస్సు నియంత్రిస్తుంది కాబట్టి, నిర్మాణ మనస్సులకు ఏ స్వాతంత్ర్యము లేదు కాబట్టి సహజమైన ప్రధాన మనస్సు చెప్పినట్లు నిర్మాణ మనస్సులు ప్రవర్తిస్తాయి (5 వ సూత్రము). సహజమైన ప్రధాన మనస్సులో ఏ

క్లేశములు, సంస్కారములు లేవు కాబట్టి, నిర్మాణ మనస్సులకు క్లేశములు, సంస్కారములు అంటుకునే అవకాశమే లేదు.

యోగికి జన్మ, ఔషధము, మంత్రము, తపస్సులతో కలిగిన సిద్ధులతో వేరే శరీరములను, ఆ శరీరములలో నిర్మాణ మనస్సులను సృష్టి చేసుకున్నప్పుడు, ఆ యోగి సహజమైన ప్రధాన మనస్సులో మరియు నిర్మాణ మనస్సులలో ధ్యాన ప్రక్రియ జరగలేదు కాబట్టి, ఆ మనస్సులలో క్లేశములు, ఆ క్లేశముల ద్వారా కలిగే సంస్కారములు తప్పకుండా ఉంటాయి. కాబట్టి ఆ మనస్సులకు కైవల్యము పొందుటకు అర్హత కలగదు.

జన్మజన్మల నుండి మనస్సులో ఉండే క్లేశములు ఆ క్లేశముల ద్వారా పేరుకున్న సంస్కారముల వలన మానవులు అనేక కష్టములు పడుతున్నారు. మానవుల కష్టములకు కారణమైన ఆ క్లేశములు మరియు సంస్కారములు పోవాలంటే ధ్యానము ఒక్కటే దానికి సాధనము. మనస్సుని వేరు, వేరు ప్రాపించక విషయములవైపు పోనీయకుండా దివ్యమైన ఆత్మ మీద ఏకాగ్రతతో మనస్సును కేంద్రీకరించి, ధారణను సాధిస్తే, ధారణ ద్వారా ధ్యానము, ధ్యానము క్రమముగా సమాధి స్థితిగా మారిపోతుంది.

**శాస్త్ర నియమము** – "**యాని కృతార్థ లక్షణాని తాని ఇతరేషామ్ సాధనాని భవంతి**" - శాస్త్ర వాక్యములలో ఒక సాధన ద్వారా ఒక ఫలితమును పొందిన వారి గురించి చెప్పినట్లయితే, ఇతరులు కూడా అదే సాధన అనుష్ఠానము చేసినట్లయితే, వారికి కూడా అదే ఫలితము కలుగుతుంది అని చెప్పటము ఒక లక్షణము.

మనస్సులో ఉండే క్లేశముల ద్వారా సంస్కారములు ఏర్పడతాయి. సంస్కారముల ద్వారా మానవులు అనేక కర్మలు చేసి కష్టముల పడుతున్నారు. ధ్యానము ద్వారా క్లేశములను వాటి ద్వారా కలుగే సంస్కారములను పోగొట్టుకొని మనస్సుని పరిశుభ్రము చేసుకుంటే కైవల్యము పొందుటకు అర్హత కలుగుతుంది.

## 7. కర్మాశుక్లాకృష్ణమ్ యోగినస్త్రివిధమితరేషామ్

**కర్మ అశుక్ల అకృష్ణమ్ యోగిన స్త్రివిధ మితరేషామ్** –

**కర్మ అశుక్ల అకృష్ణమ్ యోగిన** - యోగి విషయములో కర్మ తెల్లది (మంచిది, పుణ్యము) కాదు, నల్లది (చెడ్డది, పాపము) కాదు. యోగి యొక్క కర్మలు పుణ్య, పాపములతో ఏ సంబంధము ఉండదు.

**త్రివిధ మితరేషామ్** – ఇతరులకు కర్మ మూడు (1. పుణ్య కర్మ, 2. పాప కర్మ, 3. పుణ్యము మరియు పాపము కలిసిన కర్మ) రకములుగా ఉండవచ్చు.

కర్మలు మానవుల మనస్సులో కర్మ సంస్కారములను, కర్మ ఫలితముల సంస్కారములను పుట్టిస్తాయి. కర్మ ఫలితములు మరొక కర్మల మీద కోరికలను పుట్టించి, ఆ కోరికల ద్వారా రాగము, ద్వేషములు అనే క్లేశములు పుట్టి, రాగ, ద్వేషముల సంస్కారములు కూడా పుట్టిస్తాయి. ఇలా కర్మలు మూడు రకముల (1. కర్మ ఫలితముల సంస్కారములు, 2. రాగము సంస్కారములు, 3. ద్వేషము సంస్కారములు) సంస్కారములను పుట్టిస్తాయి. ఇది ఒక పరంపరగా లేదా అంతము కాని గొలుసులా కొనసాగుతూనే, పెంచుతూనే ఉంటుంది. 1. కర్మ పుణ్య కర్మ అయితే, పుణ్య కర్మల ఫలముల సంస్కారములను, వాటికి సంబంధించిన రాగము లేదా ద్వేషముల సంస్కారములను పుట్టిస్తాయి. 2. కర్మ పాప కర్మ అయితే పాప కర్మల ఫలముల సంస్కారములను, వాటికి సంబంధించిన రాగము లేదా ద్వేషముల సంస్కారములను పుట్టిస్తాయి. 3. కర్మ పుణ్యము మరియు పాపము కలిసిన కర్మ అయితే పుణ్యము మరియు పాపము కలిసిన కర్మ ఫలితముల

సంస్కారములను, వాటికి సంబంధించిన రాగము లేదా ద్వేషముల సంస్కారములను పుట్టిస్తాయి.

మానవులు తమ శరీరమును సంరక్షించుకుందుకు లేదా ఏదైనా కోరికతో కర్మలు చేసినప్పుడు, ఇతర ప్రాణులకు ఏదో కొంత హింస జరుగుతుంది. శరీరము పోషించుటకు మనము ఇంట్లో అన్నము వండుకుంటే, ఆ వంట అనే క్రియలో ఎన్నో ప్రాణులకు హింస జరిగి తీరుతుంది. అలాగే మనము పుణ్యము కోసము చేసే పుణ్య కర్మలు చేసేటప్పుడు కూడా ఇతర ప్రాణులకు హింస జరుగుతుంది. ఈ కర్మలు పుణ్య, పాప (శుక్ల, కృష్ణ) కలిసిన కర్మల క్రిందకు వస్తాయి. ఈ మూడు రకముల కర్మలకు ఫలితములు తప్పనిసరిగా కలుగుతాయి. ఆ కర్మ ఫలితముల సంస్కారములు, రాగ, ద్వేష సంస్కారములు కలుగుతాయి. కాని ధారణ, ధ్యానము, సమాధి సిద్ధించిన యోగి ఫలితముల కోసము ఏ కర్మ చేయడు కాబట్టి, యోగి ఈశ్వరార్పణ బుద్ధితో చేసే నిష్కామ కర్మలు (పాప కర్మలు కాదు, పుణ్య కర్మలు కాదు, పాప, పుణ్య కలిసిన కర్మలు కాదు), తాను కర్తగా భావించడు కాబట్టి, ఆ కర్మలు కర్మల క్రింద పరిగణించబడవు. యోగి కర్మ ఫలితములను అనుభవించాడు కాబట్టి, యోగికి కర్మ ఫలితముల సంస్కారములు, ఆ సంస్కారముల

ద్వారా కలిగే రాగము, ద్వేషము అసలే ఉండవు కాబట్టి రాగ, ద్వేష సంస్కారములు కూడా కలగవు.

ఈ కర్మ నేను చేస్తున్నాను అనే భావనతో చేసే కర్మలకు, ఈ కర్మలకు నాకు ఫలితము కావాలి అనే కోరికలతో చేసే కర్మలకు, జీవులు ఆ కర్మలకు ఫలితములును తప్పకుండా అనుభవిస్తారు. ఆ కర్మ ఫలితముల ద్వారా ఆ జీవులలో కర్మ సంస్కారములు ఏర్పడి, ఆ కర్మ సంస్కారముల ద్వారా వారిలో రాగము, ద్వేషము ఏర్పడి రాగ సంస్కారములు, ద్వేష సంస్కారములు ఏర్పడతాయి. ఈ సంస్కారముల ప్రభావములతో జీవులు అనేక పుణ్య, పాప కర్మలు చేస్తారు. ఆ కర్మలకు మరలా ఫలితములు అనుభవించుటకు జన్మ పరంపరలో (జన్మ, మృత్యువు మరలా జన్మ, మృత్యువు) చిక్కుకొని జీవులు ఈ సంసార సాగరములో తిరుగుతూనే ఉంటారు.

కాని ఎవరైతే తాము చేసే కర్మలకు నేను కర్తను కాదు అనే భావనతో (కర్తృత్వము లేని కర్మలు), చేస్తారో లేదా ఏ ఫలితము ఆశించకుండా చేసే కర్మలకు (నిష్కామ కర్మలు) ఫలితములు అంటవు. ఆ కర్మలకు సంబంధించిన ఏ సంస్కారములు కూడా అంటవు. అప్పుడు వారికి రాగము, ద్వేషము కూడా కలగవు, వాటికి సంబంధించిన సంస్కారములు కూడా కలగవు. ఈ స్థితిని పొందాలంటే ధ్యానము మరియు సమాధి వరకు

ఉన్న ఎనిమిది (8) యోగాంగములను (యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానము, సమాధి) సాధించుకోవాలి. అప్పుడు ఆ యోగులు కైవల్యము పొందుటకు అర్హత పొందుతారు.

## 8. తతస్తద్విపాకానుగుణానామేవాఽభివ్యక్తిర్వాసనానామ్

**తతః స్తద్విపాక అనుగుణానామేవ అభివ్యక్తిర్ వాసనానామ్** – పుణ్య కర్మలు, పాప కర్మలు, పాప పుణ్య కర్మలు, ఆ కర్మల ద్వారా కలిగిన సంస్కారములు మనస్సులో పేరుకొని నిద్రాణ స్థితిలో ఉన్నట్లయితే, ఆ కర్మలు, సంస్కారములు దుష్పరిణామములు చెంది, ఆ జీవి చేసుకున్న కర్మల ఫలితములను అనుభవించవలసిన సమయము వచ్చినప్పుడు, ఆ క్రమ సంస్కారములు (వాసనలు) ఒక్కసారిగా పైకి లేచి ఆ కర్మల ఫలితములను కలగచేస్తాయి.

సంస్కారములు (వాసనలు) ఒకసారి మనస్సులోకి చేరితే, ఆ సంస్కారములు మనస్సులో ఏదో ఒక మూల నిద్రాణ స్థితిలో ఉంటాయి. అవి ఉన్నట్లు తెలియదు, ఎప్పుడు అభివ్యక్తమౌతాయో (పైకి లేస్తాయో) కూడా తెలియదు. ఒక్క ధ్యానముతో తప్ప,

అవి మనస్సులో నుండి బయటకు తొలగిపోవు. ఏ రకమైన కర్మల ద్వారా ఈ సంస్కారములు మనస్సులో పుట్టి, పేరుకొని, నిద్రాణ స్థితిలో ఉన్నాయో, ఆ కర్మల ఫలితములను అనుభవించవలసిన సమయము వచ్చినప్పుడు (1 వ సూత్రము ప్రకారము - మరొక కొత్త జన్మలో కాని, లేదా 2 వ సూత్రము ప్రకారము - ఆ జన్మలోనే ప్రకృతి పరిణామములు కలిగినప్పుడు) ఆ సంస్కారములు కూడా అభివ్యక్తమై (పైకి లేచి), వాటి ప్రభావములను కూడా కలగచేస్తాయి.

**ఉదాహరణ:**

1. ఆవు జన్మ ఎత్తిన జీవి గడ్డిని చూస్తే, ఆ గడ్డి తినటానికి ఇష్టముగా పరుగెట్టుకుంటూ వెళ్ళుతుంది. ఆవు ఏ ప్రాణిని (మాంసము) తినదు. ఆవుకి గడ్డి నీ ఆహారము, మాంసము తినకూడదు, అని ఎవరు చెప్పారు? అదే జీవి తరువాత జన్మలో సింహముగా పుట్టినట్లయితే, ఆ గడ్డిలో తిరుగుతున్నా, ఆ గడ్డిని పొరపాటున కూడా నోటితో ముట్టుకోదు. ఆ గడ్డిని తినే ప్రాణులను వేటాడి తింటుంది. ఆ సింహానికి గడ్డి తినకూడదు, ప్రాణులను (మాంసము) మాత్రమే తినాలి, అని ఎవరు చెప్పారు? జీవులు చేసుకున్న కర్మల ఫలితముగా జన్మలు కలిగినప్పుడు, ఆ కర్మల ఫలితములకు అనుగుణముగా, ఆ కర్మలకు సంబంధించిన సంస్కారములు అభివ్యక్తమయి, వాటి

ప్రభావములు చూపిస్తాయి. ఆ జీవి ఆ సంస్కారముల అనుగుణముగా ప్రవర్తిస్తుంది.

2. మానవ జన్మ ఎత్తిన జీవి బాల్యములో ఉన్నప్పుడు ఒక రకముగా ప్రవర్తిస్తాడు. యవ్వనములో, బలము, గట్టిగా ఉన్నప్పుడు మరొక రకముగా ప్రవర్తిస్తాడు. ముసలితనములో మరొక రకముగా ప్రవర్తిస్తాడు. ఒకే జీవి, ఒకే శరీరములో ఉన్నా, వేరు, వేరు అవస్థలలో వేరు, వేరుగా ఆలోచించి వేరు, వేరుగా ప్రవర్తిస్తాడు. శరీరములో (ప్రకృతిలో) ఏ పరిణామము కలిగినా, ఆ పరిణామములకు తగినట్లుగా ఆలోచనలలో, ప్రవర్తనలలో కూడా పరిణామము కలుగుతోంది. ఆ ఆలోచనలలో, ప్రవర్తనలలో పరిణామములు కర్మ ఫలితముల సంస్కారముల ద్వారా కలుగుతుంది. ఒక వ్యక్తి ఒక సమయములో నాస్తికుడిగా (భగవంతుడు లేదు) అనే నమ్మకముతో ఉన్నవాడు, కొన్ని సందర్భములలో తన నమ్మకమును మార్చుకొని, ఆస్తికుడిగా (భగవంతుడు ఉన్నాడు) అనే పరిణామము కలుగుతుంది. ఈ పరిణామము కూడా కర్మ ఫలితముల సంస్కారముల ద్వారానే కలుగుతుంది.

3. మూడవ సూత్రము ఉదాహరణలో నహుష మహారాజు కథ వివరముగా ఉంది. నహుష మహారాజు ఉత్తమ జన్మ ఎత్తి, ఎన్నో అశ్వమేధ యాగములు, ధర్మ,

పుణ్య కార్యములు చేసి ఇంద్ర పదవి దాకా ఎదిగాడు. తాను పూర్వ జన్మలలో చేసుకున్న పుణ్య కర్మల ఫలితములను, ఆ పుణ్య కర్మలకు తగిన మంచి సంస్కారములు చెప్పినట్లు నడచుకున్నాడు. నహుషుడికి అంతవరకు లేని అహంకారము, పాప కర్మలు చేయాలనే ఆలోచనలు, ఆ పాప కర్మలకు తగ్గ కుసంస్కారములు ఇంద్ర పదవి పొందాక, ఎలా పైకి లేచి వాటి ప్రభావము చూపించాయి? అంతవరకు నిద్రాణ స్థితిలో ఉన్న కొండచిలువ శరీరము పొందే పాప కర్మ ఫలములు, దాని ద్వారా కలిగిన కుసంస్కారము అభివ్యక్తమై వాటి ప్రభావము కలిగించి, నహుషుడిలో అహంకారమును పెంచి, నహుషుడికి ఇంద్రుడి భార్య శచీదేవి మీద మోహము కలిగించి, సప్త ఋషులతో పల్లికి మోయించుకొంటూ వెళ్ళుతూ, పల్లకిని వేగముగా తీసుకువెళ్లట లేదని కోపము వచ్చి, అగస్య మహర్షిని ఎడమ కాలుతో తన్నుతూ "సర్ప", సర్ప (త్వరగా వెళ్ళు, త్వరగా వెళ్ళు) అనే స్థితికి దిగజారిపోయాడు. దానికి ఫలితముగా అగస్య మహర్షి శాపముతో వెంటనే కొండచిలువ శరీరమును పొంది భూమి మీద పడ్డాడు. కొండచిలువ శరీరము పొంది దొరికిన ప్రాణులను తినే పాప కర్మ మరియు కుసంస్కారము ఎక్కడ నుండి వచ్చింది? ప్రాణులను తినే కుసంస్కారము అంతవరకు ఆ జీవిలో నిద్రాణ

స్థితిలో ఉండి, కొండచిలువ శరీరము అనే కర్మ ఫలితము పొందాక, ఆ కర్మ ఫలితము ద్వారా కలిగిన ప్రాణులను తినాలి అనే కుసంస్కారము అభివ్యక్తమై తన ప్రభావము చూపించింది, కొండచిలువలానే ప్రవర్తించాడు.

## 9. జాతిదేశకాలవ్యవహితానామప్యానంతర్యమ్ స్మృతి సంస్కారయోరేకరూపత్వాత్

**జాతి దేశ కాల వ్యవహితానామపి ఆనంతర్యమ్ స్మృతి సంస్కారయోః ఏక రూపత్వాత్** -

మానవులు ఒక జన్మలో ఎన్నో దృశ్యములను చూస్తాడు, విషయములను వింటాడు, తెలుసుకుంటాడు. ఏ మానవులకు ఆ అన్ని దృశ్యములు, విషయములు స్పష్టముగా గుర్తు ఉండవు. సాధారణముగా ఎక్కువ ప్రభావము కల్పించిన ప్రధానమైన దృశ్యములు, విషయములు మరియు దగ్గరలో జరిగిన విషయములు మాత్రమే గుర్తు ఉంటాయి.

**జాతి (దేశ కాల) వ్యవహితానామపి** ఒక జీవి తాను చేసుకున్న కర్మ ఫలితముల అనుగుణముగా ఎన్నో జన్మలు ఎత్తుతాడు. ఒక ఉదాహరణలో ఒక పిల్లి జన్మ ఎత్తిన జీవి, ఎన్నో జన్మలు తరువాత మానవ జన్మ

ఎత్తి, తరువాత పిల్లి జన్మ ఎత్తాడు అని అనుకుందాము. ఆ జీవి మొదట పిల్లి జన్మకు, తరువాత పిల్లి జన్మకు మధ్యలో ఎన్నో జన్మల (జాతుల – కుక్క, నక్క, చీమ, ఈగ, ఆవు, మానవుడు మొదలైనవి) జాతుల యొక్క సంస్కారముల వ్యవధానము (placing apart, మధ్యలో రకరకాల జాతుల జన్మలు ఉన్నాయి) ఉంది. ఆఖరి పిల్లి జన్మ ముందు మానవ జన్మ ఉంది.

**(జాతి) దేశ (కాల) వ్యవహితానామపి** – పై ఉదాహరణే – ఆ జీవి మొదటి పిల్లి జన్మ ఆంధ్ర రాష్ట్రములో పుట్టి, తరువాత ఎన్నో జన్మల తరువాత మళ్ళీ పిల్లి జన్మ కాశ్మీరులో పుట్టింది అనుకుందాము. ఆ జీవి మొదట పిల్లి జన్మకు, తరువాత పిల్లి జన్మకు మధ్యలో ప్రదేశము యొక్క సంస్కారముల యొక్క వ్యవధానము (మధ్యలో రకరకాల ప్రదేశములు ఉన్నాయి) ఉంది.

**(జాతి దేశ) కాల వ్యవహితానామపి** - పై ఉదాహరణే – ఆ జీవి మొదటి పిల్లి జన్మ 1,000 సంవత్సరముల క్రితము పుట్టి, తరువాత ఎన్నో జన్మల తరువాత మళ్ళీ పిల్లి జన్మ 1,000 తరువాత పుట్టింది అనుకుందాము. ఆ జీవి మొదట పిల్లి జన్మకు, తరువాత పిల్లి జన్మకు మధ్యలో కాలము యొక్క సంస్కారముల యొక్క వ్యవధానము (మధ్యలో రకరకాల కాలములు ఉన్నాయి) ఉంది.

**ఆనంతర్యమ్ స్మృతి సంస్కారయోః ఏక రూపత్వాత్** – మొదటి పిల్లి జన్మకు, తరువాత పిల్లి జన్మకు మధ్యలో ఎన్నో జాతుల, ప్రదేశముల, కాలములు బేధములు ఉన్న తరువాత, ఇప్పుడు పుట్టిన పిల్లి, పిల్లి లక్షణములతో జీవించాలంటే, ఎన్నో జన్మల క్రితము పుట్టిన పిల్లి జన్మ యొక్క సంస్కారములు, స్మృతులు ఎలా పనిచేస్తాయి అనే ప్రశ్నకు జవాబుగా – ఇలా అనేక జాతుల జన్మలు మధ్యలో ఉన్నా, ప్రదేశములు మారిపోయినా, కాలములలో మారు ఉన్నా, పిల్లి జన్మ ఎత్తవలసిన కర్మల ఫలితములు పనిచేస్తున్నాయి కాబట్టి, ఆ పిల్లి జన్మ ఎత్తవలసిన కర్మల ఫలితముల ద్వారా కలిగి, నిద్రాణ స్థితిలో ఉన్న సంస్కారములు అభివ్యక్తమై ఆ సంస్కారములు, స్మృతులు వెంటనే పనిచేస్తాయి. సంస్కారములు స్మృతులు పనిచేసే విధానము ఒక్కటే.

**సంస్కారములు, స్మృతులు** – జీవులలో అసంఖ్యాకమైన సంస్కారములు, స్మృతులు ఉంటాయి. జీవుడికి కర్మ వాసన (కొత్త పండు తిన్న అనుభవము) ద్వారా ఒక కొత్త అనుభవము (జ్ఞానము) కలిగినప్పుడు, ఆ అనుభవము ద్వారా అదే విషయము మీద సంస్కారము మరియు అదే విషయము మీద స్మృతి కలిగి మనస్సులో ముద్రించబడి ఉంటుంది.

జీవుడికి అదే సంస్కారము సరైన సమయములో ఉద్బోధకమైతే (మేలుకున్నప్పుడు), ఆ సంస్కారము ద్వారా కలిగిన అదే స్మృతి కూడా అభివ్యక్తమవుతుంది. అదే సంస్కారము ఉద్బోధకము అవటానికి చాలా కారణములు ఉంటాయి. జన్మ సంస్కారములు, జన్మ స్మృతులు కలగటానికి ప్రధానమైన కారణములు జీవుడు తాను చేసుకున్న కర్మ మరియు ఆ కర్మ పరిపక్వము అవటానికి కావలసిన కాలము (సమయము). జీవుడు తాను చేసుకున్న కర్మలకు సరైన సమయములో పరమేశ్వరుడు ఆ కర్మలకు ఫలితములను ఇస్తాడు. జీవుడు తాను చేసుకున్న ఏ కర్మ ఫలితము అనుభవిస్తున్నాడో, ఆ కర్మ ద్వారా కలిగిన సంస్కారములు, ఆ సంస్కారముల ద్వారా కలిగిన స్మృతులు ఉద్బోధకమై (మేలుకొని), జీవుడు ఆ సంస్కారములకు, స్మృతులకు అనుగుణముగా వ్యవహరిస్తాడు.

పిల్లి జన్మ అయినా లేదా ఏ జన్మ అయినా అది మొదటి జన్మ అయితే ఆ జన్మలో ఆ జాతి జీవిగా జీవించుటకు, సంస్కారములు, స్మృతులు, ఆలోచనలు ఎలా వస్తాయి? అనే ప్రశ్న వస్తే, 10 వ సూత్రములో జవాబు చెప్పుతున్నారు.

## 10. తాసామనాదిత్వమ్ చాశిషో నిత్యత్వాత్

**తాసామ్ అనాదిత్వమ్ చ ఆశిషో నిత్యత్వాత్**-

**తాసామ్ అనాదిత్వమ్ చ** - జన్మ, కర్మలు, కర్మ ఫలములు, సంస్కారములు, స్మృతులు అన్నీ అనాదిగా (వాటికి మొదలు అనేది లేదు) ఉన్నాయి. జీవుడికి మొదటి జన్మ అనేది లేనే లేదు.

**ఆశిషో నిత్యత్వాత్** – జీవుడు చేసుకున్న కర్మ ఫలము అనుభవించుటకు జన్మ కలుగుతుంది. జీవుడు ఒక వ్యక్తి లేదా వస్తువు మీద రాగముతో (కోరికతో) లేదా ద్వేషముతో (కోపముతో) ఏదో ఒక కర్మ చేస్తాడు. జీవుడు రాగము, ద్వేషములను నియంత్రించలేడు. జీవుడు ఒక వ్యక్తి లేదా వస్తువు అనుకూలము అనే ఆలోచన వస్తే దానిమీద రాగము (ప్రేమ, కోరిక) స్వభావముగా పుడుతుంది. ఒక వ్యక్తి లేదా వస్తువు ప్రతికూలము అనే ఆలోచన వస్తే దానిమీద ద్వేషము (కోపము, విరోధము) స్వభావముగా పుడుతుంది. ఈ ఆలోచనలు సంస్కారముల ద్వారానే పుడతాయి. ఆ సంస్కారములకు మరలా ఆలోచనలు కారణములు. ఇలా ఆలోచనలు, సంస్కారములు వెతుక్కుంటూ వెనక్కు వెళ్ళితే (చెట్టు ముందా? విత్తనము ముందా? అనే ప్రశ్నకు జవాబు మొదలు లేదు అనే జవాబు వచ్చినట్లు) దీనికి కూడా మొదలు లేదు అనే జవాబు దొరుకుతుంది. ఈ రాగము, ద్వేషము నిత్యము

(మొదలు లేదు). అలాగే సృష్టి, జీవుడి మొదటి జన్మ అనేది కూడా లేదు. సృష్టి, జీవుడి జన్మ అనాది.

**ఉదాహరణ:**

ఒక శిశువు తల్లి ఒడిలో నుండి జారుపోబోతుంటే, ఆ శిశువు తల్లిని (చీరనో, మంగళ సూత్రమునో) గట్టిగా పట్టుకుందుకు ప్రయత్నిస్తాడు. జారిపడితే ఆ శిశువుకి దెబ్బ తగులుతుందని ఎవరు చెప్పారు? ఏ ప్రాణికైనా సహజమైన స్వభావము అభినివేశము – "**మా నభూవంహి భూయాసం**" అనే ప్రీతి - "నేను భద్రంగా ఉండాలి" – నేను బతకాలి, నేను బాగుండాలి, నా ప్రాణమునకు, నా శరీరమునకు ఏ హానీ కలగకూడదు అనే కోరిక. నా ప్రాణము నా శరీరము నుండి బయటకు పోకూడదు. ఇది గత జన్మలలోని అనుభవము ద్వారా కలిగిన సంస్కారము. ఈ సంస్కారము ఎలా కలిగింది అని ఆలోచిస్తే, గత జన్మలో, అంతకు ముందు జన్మలో, అంతము ముందు అలా వెనక్కు వెళ్ళితే దానికి మూలము దొరకదు. అందుచేత జన్మలు, సంస్కారములు అనాది (ఆది లేదు, మొదలు లేదు) అని ఒప్పుకోవాలి.

ఈ సంస్కారములకు మూలము కర్మలు, ఆ కర్మలకు మూలము మనస్సులో ఉండే రాగము, ద్వేషములు. మనస్సును, మనస్సులో ఉండే రాగము,

ద్వేషములను నియంత్రించుకుంటే, కర్మలను సంస్కారములను నియంత్రించుకోవచ్చు. మనస్సులో ధర్మ మార్గమును పెంచుకోగలిగితే, మనస్సులో ఉండే రాగము, ద్వేషములను నియంత్రించుకోవచ్చును.

**1. శారీరక ధర్మము** - ఏ అవయవముతో ధర్మము చేసుకున్నా, అది శారీరక ధర్మము అవుతుంది. శారీరక ధర్మము ద్వారా కలిగిన సంస్కారములు, ఆ జీవుడిలో ఉన్న కుసంస్కారముల ప్రాబల్యమును కొంతవరకు తగ్గిస్తాయి.

**2. మానసిక ధర్మము** – మైత్రి, కరుణ ముదిత, ఉపేక్ష, శ్రద్ధ మొదలైన మంచి గుణములు మానసిక ధర్మములు అవుతుంది. మానసిక బలముతో అసాధ్యమైన ఫలితములను సాధించవచ్చు. మానసిక ధర్మము ద్వారా కలిగిన సంస్కారములు ఆ జీవుడిలో ఉన్న కుసంస్కారముల ప్రాబల్యమును క్రమక్రమముగా తగ్గి, రాగ ద్వేషముల ప్రాబల్యములను కూడా పూర్తిగా తగ్గిస్తాయి.

## 11. హేతుఫలాశ్రయాలంబనైః సంగృహీతత్వాదేషామభావే తదభావః

**హేతు ఫల ఆశ్రయ ఆలంబనైః సంగృహీతత్వాద్ ఏషామ్ అభావే తదభావః** – సంస్కారముల కారణములను, ఇచ్చే ఫలితములను,

ఆశ్రయము (ఎక్కడ, ఎలా ఉంటుంది), ఆధారము గురించి వివరముగా తెలుసుకొని, తమ ప్రభావములను చూపకుండా ఉండేలా చేయగలిగితే, కొత్త సంస్కారములు పుట్టావు, మనస్సులో ఉన్న సంస్కారములు మేలుకోకుండా, నిద్రాణ స్థితిలోనే ఉండిపోతాయి లేదా వాటి ప్రభావము చూపవు.

**సంస్కారములకు హేతువులు (కారణములు)** – జీవులు చేసే కర్మలు, జీవులు పొందే కర్మ ఫలితములు, జీవులలో ఉండే రాగము, ద్వేషము సంస్కారములకు హేతువులు.

**సంస్కారముల ఫలితములు** – సంస్కారముల ప్రభావముతో జీవుడు కర్మలు (పుణ్యము, పాపము) చేసి, జీవుడికి జన్మలు, ఆ జన్మలలో కర్మ ఫలితములను (సుఖము - రాగము, దుఃఖము - ద్వేషము) కలగచేస్తాయి. సంసార చక్రములో జీవులను బంధిస్తున్నాయి. జీవుడు రాగముతో (కోరికతో) కర్మలు (పుణ్యము - ధర్మము), ద్వేషముతో (పాపము - అధర్మము) చేస్తాడు. ఈ ధర్మము, అధర్మము అనే కర్మల ద్వారా సుఖము మరియు దుఃఖము అనే ఫలితములు కలుగుతాయి. ఆ సుఖము ద్వారా రాగము, దుఃఖము ద్వారా ద్వేషము మరలా పుట్టుకొస్తాయి. ఈ విధముగా సంసార చక్రము కొనసాగుతూనే ఉంటుంది. ఈ సంసార చక్రములో

(ఆరు కడ్డీలు – రాగము, ద్వేషము, పుణ్యము/ధర్మము, పాపము/అధర్మము, సుఖము, దుఃఖము) ఉన్నాయి. అందుచేత సంసార చక్రమును **“షడరమ్ సంసార చక్రమ్”**. సంస్కారముల ద్వారా ఈ సంసార చక్రము కలుగుతోంది. సంసార చక్రము సంస్కారములకు కారణము అవుతోంది. వీటన్నిటికీ మూల కారణము అవిద్య.

**సంస్కారముల ఆశ్రయము** – సంస్కారములు మనస్సుని ఆశ్రయించుకొని, మనస్సులో నిద్రాణ స్థితిలో ఉంటాయి.

**సంస్కారముల ఆలంబనము (ఆధారము)** – సంస్కారములకు ఆధారము ప్రాపించక విషయ/వస్తు దర్శనము. ఒక వస్తువును/విషయమును చూసి/విని, ఆ వస్తువు/విషయము అనుకూలము లేదా ప్రతికూలము అనే ఆలోచన, భావన కలిగినప్పుడు, ఒక కొత్త సంస్కారమును పుట్టిస్తుంది. తరువాత ఆ వస్తువును/విషయము ఎప్పుడు చూసినా/విన్నా ఆ సంస్కారము ఆ వస్తువు/విషయము అనుకూలము లేదా ప్రతికూలము అనే ఆలోచన, భావన కలిగిస్తూనే ఉంటుంది. అప్పుడు సహజముగానే ఆ వస్తువు మీద రాగము లేదా ద్వేషము కలుగుతుంది. ఆ రాగము లేదా ద్వేషము షడర సంసార చక్రములో కలిసి ఆ చక్రమును తిప్పుతూనే ఉంటుంది.

పైన వివరించిన నాలుగు కారణములు సంస్కారములను బలపరుస్తాయి, ఉద్బోధము చేసి, ప్రేరేపించి కర్మలను చేయిస్తాయి, కొత్త సంస్కారములను పుట్టిస్తాయి. అలా సంస్కారములు పేరుకొని, పేరుకొని జీవుడిని సంసార చక్రములో తిప్పుతూనే ఉంటాయి.

ఈ సంస్కారములను తగ్గించుకునే ప్రయత్నములో మొదట అధర్మ/పాప సంస్కారములను, ధర్మ/పుణ్య సంస్కారములతో కడిగేసుకోవాలి. ధర్మ/పుణ్య సంస్కారములను కూడా తగ్గించుకుందుకు, 11 వ సూత్రములో చెప్పిన విధముగా మానసిక ధర్మ సంస్కారములను పెంచుకుంటే, సుఖములు/దుఃఖములు కూడా తగ్గుతాయి. అలా ఫలితముల అనుభవములు తగ్గితే, రాగము/ద్వేషము కూడా తగ్గుతాయి.

"**సాధికారమ్ మనః**" – ఈ సంసార చక్రము నడిపే ముఖ్య కారణమైన మనస్సు, ఈ సంస్కారములకు ఆశ్రయము కాబట్టి, మనస్సుని నియంత్రిచుకొని, మనోవృత్తులను ఆపుకునే సమాధి స్థితిని సాధించుకోవాలి. లేదా యోగ సాధనతో మనస్సుని ప్రకృతిలో లీనము చేసేయాలి.

ప్రాపించక వస్తువులను/విషయములను అనుకూలము (రాగము) లేదా ప్రతికూలము (ద్వేషము) అనే దృష్టితో చూడకుండా, ఉన్నది ఉన్నట్లు చూడగలిగితే, విషయ దర్శనము అనే ఆలంబనము (కారణము) ద్వారా కోటా సంస్కారములు పుట్టవు, మనస్సులో నిద్రాణ స్థితిలో ఉన్న పాత సంస్కారములు కూడా మేలుకోకుండా ఉండిపోయి, వాటి ద్వారా ఏ ప్రభావము కలగకుండా ఉంటుంది.

**<u>ఉదాహరణ:</u>**

ఒక వ్యక్తి దొంగతనము చేయుటకు అలవాటుపడ్డాడు. అతను చాలా దొంగతనములు చేశాడు. ఒక రోజు దొంగతనము చేస్తూ ఉండగా, ఆ రోజు దొంగ అదృష్టము బాగా లేక పట్టుబడిపోయాడు. వాళ్ళు ఆ దొంగని పోలీసులకు అప్పగించారు. వాడి మీద కేసు జరిగింది. ఆ దర్యాప్తులో ఆ దొంగ చేసిన పాత దొంగతనములు కూడా బయట పడ్డాయి. ఆ అన్ని కేసులకు కోర్టు, వాడికి 10 సంవత్సరములు. జైలు శిక్ష వేసింది. ఆ దొంగ 10 సంవత్సరములు జైలు శిక్ష అనుభవించాడు. జైలు శిక్ష పూర్తి అయిన తరువాత, వాడిని జైలు నుండి విడుదల చేసే రోజు వచ్చింది. ఆ రోజు వాడిని విడుదల చేస్తూ ఉండగా, రోజుల లెక్కలలో పొరపాటు జరిగి, ఆ దొంగను రెండు రోజులు ఎక్కువ జైలులో ఉంచారు అని తెలిసింది. ఆ జైలు అధికారి, ఆ

దొంగను పిలిచి, లెక్కల పొరబాటు కారణముగా రెండు రోజులు జైలులో ఎక్కువ ఉంచినందుకు, ఏమీ అనుకోవద్దు, ఎవరికీ చెప్పొద్దు, వాళ్ళ మీద ఏ కేసు పెట్టవద్దు అని చెప్పాడు. అప్పుడు ఆ దొంగ "పర్వాలేదు లెండి, ఈ సారి మరలా జైలు శిక్ష అనుభవించుటకు వచ్చినప్పుడు రెండు రోజులు తక్కువ ఉంచండి. అప్పుడు లెక్కలు సరిపోతాయి" అని అన్నాడు.

దీని ద్వారా తెలుసుకోవలసినది, ఆ దొంగ 10 సంవత్సరములు జైలు శిక్ష అనుభవించినా, నేను మళ్ళీ జైలుకి తిరిగి వస్తాను అని అనటములో, అతని మనస్సులో ఏ పరివర్తనా రాలేదు. అతను కరుడుగట్టిన దొంగ. బయటకు వెళ్లి మల్లె దొంగతనము చేస్తాడు, అనుకుంటాము. కాని దాని కంటె అర్థము చేసుకోవలసినది, అతని మనస్సులో ఇతరుల వస్తువులను దొంగిలించాలి అని ఉండే **"ఘన వాసన"** - దట్టమైన సంస్కారము కారణముగా, అతను మళ్ళీ దొంగతనము చేయవలసినదే. ఆ సంస్కారము అతనిలో ఉన్నంతవరకు అతను దొంగతనము చేస్తూనే ఉంటాడు, దొంగతనము మానుకోలేడు. ఆ దొంగతనము అనే సంస్కారము ఆ జీవుడిని, దొంగతనము చేయమని ప్రేరేపిస్తూ ఉంటుంది.

అదే విధముగా ప్రతి ప్రాణిలో ఉండే జీవుడిని, ఆ దొంగగా భావిస్తే, శరీరము అనే జైలులోకి ప్రవేశించిన జీవుడు (జన్మ), మళ్ళీ నాకు శరీరము అనే జైలు (పునర్జన్మ) వద్దు, అనే నిర్ణయము ఎందుకు తీసుకోవటలేదు? అప్పుడే పుట్టిన శిశువు, ఈ జన్మ (శరీరము అనే జైలులో పడినందుకు) కలిగినందుకు ఏడుస్తూ ఉంటే, పెద్దవాళ్లందరూ ఆ శిశువు చుట్టూ చేరి, ఆ శిశు పుట్టినందుకు ఆనందిస్తారు ఎందుకు? మళ్ళీ శరీరము అనే జైలుకు (పునర్జన్మకు) ఎందుకు సిద్ధపడుతున్నాడు? దీనికి కారణము జీవుల మనస్సులలో బలముగా నాటుకున్న ఘనమైన వాసనలు, దట్టమైన సంస్కారములు.

## 12. అతీతానాగతమ్ స్వరూపతోఽస్త్యధ్వభేదాద్ధర్మాణామ్

**అతీత అనాగతమ్ స్వరూపతో అస్తి అధ్వ భేదాద్ ధర్మాణామ్** -

**అతీత అనాగతమ్ స్వరూపతో అస్తి** మనస్సులో ఉండే సంస్కారములు మూడు రకములుగా ఉండవచ్చు – 1. **అతీత** – గడిచిపోయిన సంస్కారములు, 2. **ఆస్తి** - వర్తమాన సంస్కారములు, 3. **అనాగతము** - భవిష్యత్తులో కలగబోయే, పని చేయబోయే సంస్కారములు.

**అధ్వ భేదాద్ ధర్మాణామ్** – వీటి అన్నింటికీ ఆశ్రయముగా ఉండే మనస్సు స్థిరముగా ఉంది. మనస్సుని ఆశ్రయముగా పట్టుకొని ఈ సంస్కారములు పనిచేస్తాయి.

## 13. తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః

**తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః** – పైన చెప్పిన మూడు రకముల సంస్కారములు వస్తువులలో రెండు రకములుగా ఉంటాయి – 1. వ్యక్తమై పనిచేసే సంస్కారములు, 2. సూక్ష్మముగా ఉండే సంస్కారములు.

**1. వ్యక్తమై పనిచేసే సంస్కారములు** – వస్తువులలో వర్తమాన కాలములో మార్పులు అయినట్లు వాటి ప్రభావములు కనిపిస్తాయి.

**2. సూక్ష్మముగా ఉండే సంస్కారములు** – వస్తువులలో గడిచిపోయిన మరియు కలగబోయే సంస్కారములు సూక్ష్మముగా ఉంటాయి, కాబట్టి కనిపించవు.

**గుణాత్మానః** – ఈ సృష్టిలో ఉండే అన్ని వస్తువులలో కలిగే మార్పులు మూడు గుణముల (సత్త్వ గుణము, రజో గుణము, తమో గుణము) యొక్క పరిణామములు. వస్తువులలో కలిగే ఈ మార్పులు

మానవులలో సుఖము లేదా దుఃఖము లేదా వ్యామోహము కలిగిస్తాయి.

**శాస్త్ర సిద్ధాంతము** – "**గుణానామ్ పరమమ్ రూపం న దృష్టి పథ మృఛతి యత్తు దృష్టి పథం ప్రాప్తం తన్ మాయేవ సుతుచ్ఛకమ్**" – మూడు గుణముల యొక్క మార్పులను, ప్రభావములను (సుఖము, దుఃఖము, మోహము) మనము అనుభవించగలము, చూడగలము తప్ప, ఈ మూడు గుణముల వాస్తవ స్వరూపము మన కంటికి కనిపించవు, ఆ గుణములను మనము చూడలేము. ఆ గుణములు ఇంద్రియములుగా మారితే, ఆ ఇంద్రియముల ద్వారా అనుభవములను పొందగలము. ఆ గుణములు శరీరముగా మారితే, ఇంద్రియములకు ఆశ్రయముగా పనిచేస్తుంది. ఆ గుణములు మనస్సుగా మారితే, సంస్కారములను తనలో నింపుకుంటాయి. ఆ గుణములు చూడబడే వస్తువులుగా మారితే, ఈ శరీరములతో, ఇంద్రియములతో, మనస్సులతో అనుభవించుటకు ఉపయోగపడతాయి. ఈ నాటకములో ఈ గుణములు తెర వెనకాలే ఉండి, అన్ని పాత్రలు వేసేస్తాయి. ఈ శరీరములు, ఇంద్రియములు, మనస్సు, వస్తువులు ఈ మూడు గుణముల పరిణామములే. ఏ శరీరము, ఏ ఇంద్రియము, ఏ మనస్సు ఈ గుణములను అందుకోకుండా జాగ్రత్త పడతాయి. ఈ గుణములు

మాయలాంటివి. మాయ నిరంతరము ఎలా మారిపోతూ ఉంటుందో, ఆ విధముగానే ఈ శరీరము, ఇంద్రియములు, మనస్సు, ఈ వస్తువులు కూడా మారిపోతూ ఉంటాయి, కాబట్టి ఇవి నమ్మతగినవి కావు. ఈ శరీరము, ఇంద్రియములు, మనస్సు, వస్తువులు మార్పులు చెందుతూ, ఎప్పుడో ఒకప్పుడు నాశనము అయిపోతాయి. ఈ మార్పులకు (భ్రమలకు) మానవులు (జీవులు) అలవాటుపడి, వాటి మీద ఇష్టముతో, కోరికలతో, వ్యామోహముతో ప్రవర్తిస్తున్నారు. ఈ మార్పులు ఒక మాయ అని తెలుసుకోలేకపోతున్నారు. ఈ మాయ యొక్క వలలో పడకుండా ఉండాలంటే, ఈ శరీరము, ఇంద్రియములు, మనస్సు, వస్తువులు సత్యములు కావు, నిజాలు కావు, శాశ్వతము కాదు అనే వాటి వాస్తవ స్వరూపములను తెలుసుకోగలిగితే, వాటి మీద పెంచుకునే ఆసక్తి, ఇష్టము, కోరిక, వ్యామోహము తగ్గి, వాటి ద్వారా కలిగే సంస్కారములు, ఆ సంస్కారముల ప్రభావము కూడా తగ్గి, విషయముల మీద లోలత్వము పోయి పరిశుద్ధము కాగలరు. అప్పుడు జీవుడికి జైలు లాంటి ఈ జన్మలకు, శరీరములకు పరిమితము కావలసిన అవసరము ఉండదు.

## 14. పరిణామైకత్వాద్వస్తుతత్త్వమ్

**పరిణామ ఏకత్వాద్ వస్తు తత్త్వమ్** - మూడు గుణములలో మార్పులు ఒక్కటే వస్తువులలో ఉండే తత్త్వము.

మినపప్పు, బియ్యముతో కొంచెము మార్పులతో ఇడ్లీ, దోసి, దిబ్బరొట్టె, ఊతప్పము చేసుకున్నట్లే, ఈ మూడు గుణములలో కొంచము మార్పులతో సృష్టిలో ఉండే వస్తువులు అన్నీ తయారవుతున్నాయి. ఈ సృష్టికి ముందు జరుగుతున్న ప్రళయము అంతము అయ్యే సమయములో, జీవులు చేసుకున్న కర్మ ఫలితములు అనుభవించవలసిన సమయము ఏర్పడినప్పుడు, పరమాత్మ యొక్క సృష్టి సంకల్ప శక్తితో, త్రిగుణాత్మకమైన మూల ప్రకృతిలో ఉండే మూడు గుణముల పరిణామము చెంది, మొదట మహతత్త్వముగా మారుతుంది. ఆ మహతత్త్వము పరిణామము చెంది అహంకారముగా మారుతుంది. ఆ అహంకారము పరిణామము చెంది పంచ తన్మాత్రలుగా (పంచ సూక్ష్మ భూతములుగా) మారుతుంది. పంచ తన్మాత్రలు (పంచ సూక్ష్మ భూతములు) పరిణామము చెంది పంచీకరణతో పంచ మహా భూతములుగా తయారవుతాయి. ఈ మూడు గుణముల కార్య పరంపరలో ఈ పంచ మహా భూతముల నుండి వస్తువులన్నీ పుడుతున్నాయి. ఈ సృష్టిలో ఉండే అన్ని వస్తువులలో ఈ మూడు గుణముల స్వభావము ఉంటుంది. దీనిని "**అన్వయి కారణము**" అంటారు. "**చలం గుణ వృత్తమ్**" – గుణముల స్వభావము నిరంతరము చంచలముగా

ఉంటాయి. వస్తువులలో ఉండే గుణముల ప్రభావముతో నిరంతరము పరిణామములు జరుగుతూనే ఉంటాయి. **వస్తు** = "వసతీ ఇతి వస్తు" = ఒక స్థిరమైన ద్రవ్యము ఉంది, **తత్త్వము** = వస్తువుల స్వభావములను దర్శించగల జ్ఞానము. మూడు కాలములలో ఉండే వస్తువు యొక్క దశలను (మార్పులు) గురించి నిర్ణయించే జ్ఞానము.

ఈ సృష్టిలో దృశ్య పదార్థములలో (వస్తువులలో) తమో గుణము యొక్క శాతము ఎక్కువగా ఉండి, సత్త్వ గుణము, రజో గుణము యొక్క శాతము తక్కువగా ఉంటాయి. దర్శన సాధనములలో (జ్ఞానేంద్రియములలో, మనస్సులో) సత్త్వ గుణము యొక్క శాతము ఎక్కువగా ఉండి, రజో గుణము, తమో గుణము యొక్క శాతము తక్కువగా ఉంటాయి. కర్మేంద్రియములలో రజో గుణము యొక్క శాతము ఎక్కువగా ఉండి, సత్త్వ గుణము, తమో గుణము యొక్క శాతము తక్కువగా ఉంటాయి.

**ఛాందోగ్యోపనిషత్ - 6-2-1** - "**స దేవ సౌమ్యేదమగ్ర ఆసీ దేక మేవాద్వితీయం**" – నామ రూపములతో (వస్తువులతో) నిండి ఉన్న ఈ సృష్టి పుట్టుటకు పూర్వము ఏకమై అద్వితీయముగా (రెండుగా లేనిది) ఉన్నది. **ఆసీ** = వస్తువుల తత్త్వమును బోధిస్తోంది. వస్తు తత్త్వము ఉన్నది. ఆ వస్తు తత్త్వము

యొక్క పరిణామములే ఈ సృష్టిలో ఉండే అన్ని వస్తువులు. పరిణామములు, మార్పులు ఉన్నాయి కాబట్టి ఈ వస్తువులు శాశ్వతములు కావు.

## 15. వస్తుసామ్యే చిత్తభేదాత్తయోర్విభక్త పంథాః

**వస్తుసామ్యే చిత్త భేదాత్ తయోర్ విభక్త పంథాః** - ఒకే వస్తువులో ఏ భేదము లేకుండా సమముగా ఉన్నా, మనస్సులలో ఉండే బేధములను బట్టి ఆ వస్తువును అర్థము చేసుకునే విధానములలో, చూసే విధానములో భేదము ఉండవచ్చు. మనస్సులలో ఉండే భేదములను బట్టి వేరు, వేరు విధములుగా అర్థము చేసుకుంటారు, చూస్తారు. కాని ఆ వస్తువులో మాత్రము ఏ మాత్రము భేదము ఉండదు.

**యదార్థ జ్ఞానము** = అందరికీ ఒకే విధముగా ఉన్నది ఉన్నట్లుగా తెలుస్తుంది. **భ్రమ** = భ్రమ కలిగిన వారికి మాత్రమే పరిమితమై ఉంటుంది. ఇతరులకు అదే విధముగా అనిపించుటకు అవకాశము ఉండదు.

ఒక వ్యక్తి చూసిన వస్తువును మరొక వ్యక్తి ఆ విధముగానే చూడడు. ఒకే వస్తువును మానవులు వారి, వారి అనుభవముల, ఆలోచనల, అవసరముల ప్రభావములతో వేరు, వేరుగా చూస్తారు. ఒకే చెట్టుని వృక్ష శాస్త్రజ్ఞుడు ఒక దృష్టితో చూస్తే, భౌతిక శాస్త్రజ్ఞుడు మరొక దృష్టితో చూస్తాడు, ఆయుర్వేద శాస్త్రజ్ఞుడు

మరొక దృష్టితో చూస్తాడు, శిల్ప కళాకారుడు మరొక దృష్టితో చూస్తాడు, పర్యావరణ వేత్త మరొక దృష్టితో చూస్తాడు. అలా ఒకే చెట్టుని వారి, వారి మనస్సులలో ఉండే భేదముల కారణముగా వేరు, వేరు దృష్టులతో చూస్తున్నారు.

ఎవరిలో మనస్సులో సత్త్వ గుణము ఎక్కువగా ఉంటుందో, వారి దృష్టిలో వస్తువులు సుఖ కరముగా అనిపించి, ఆనందిస్తారు. ఎవరిలో మనస్సులో రజో గుణము ఎక్కువగా ఉంటుందో, వారి దృష్టిలో ఆ వస్తువులు మీద కోరికలు పెరిగి, వాటిని పొంద లేకపోతే దుఃఖ పడతారు. ఎవరిలో మనస్సులో తమో గుణము ఎక్కువగా ఉంటుందో, వారి దృష్టిలో ఆ వస్తువులు మీద వ్యామోహము కలిగి, ఆ వస్తువులను పొందటానికి ఏ అధర్మానికైనా పాలుపడతారు. ఎవరి మనస్సు ఏ విధమైన (ధర్మ లేదా అధర్మ) సంస్కారములు ఉంటే, వారు వారి సంస్కారముల ప్రభావములతో ఆ, ఆ విధముగా ఆలోచిస్తారు.

**ఉల్లేఖ అలంకార శాస్త్రము – "ఏకస్య బహుదోల్లేఖః"** - ఒకే వస్తువును రకరకాల వ్యక్తులు, రకరకాలుగా అందముగా వర్ణిస్తే దానిని ఉల్లేఖ అలంకారము అంటారు. **ఉదాహరణ – "గజత్రాతేతి వృద్ధాభిః శ్రీకాంత ఇతి యవ్వతైః యథా స్థితశ్చ బాలాభిః దృష్ట సౌరి సకౌతుకం"** – కొంతమంది

ముసలమ్మలు శ్రీకృష్ణుడిని చూసి, ఈయన గజేంద్రుడుని రక్షించినవాడు అని అనుకున్నారు. కొంతమంది పడుచు స్త్రీలు శ్రీకృష్ణుడిని చూసి, ఈయన లక్ష్మీదేవికి పతి అని అనుకున్నారు. కొంతమంది చిన్న పిల్లలు శ్రీకృష్ణుడిని చూసి, నల్లగా ఉన్నాడు, నెత్తి మీద నెమలి పించేము ఉంది, అందమైన బట్టలు కట్టుకున్నాడు, ఆకర్షణీయముగా ఉన్నాడు అని అనుకున్నారు. అందరూ ఒకే శ్రీకృష్ణుడిని కుతూహలముగా చూశారు, కాని చూడటములో వారి, వారి దృష్టి మాత్రము వేరు, వేరుగా ఉంది.

ముసలమ్మలకు శక్తి క్షీణించి, ఈ జన్మలో ఆఖరి దశలో ఉన్నారు కాబట్టి, గజేంద్రుడుని సంసారము నుండి రక్షించినట్లు, ఈయన మమ్మలను కూడా అలానే ఈయన రక్షిస్తాడు అనే దృష్టితో చూశారు. పడుచు స్త్రీలు, లక్ష్మీదేవికి చంచల స్వభావము ఉంది. అలాంటి చంచలమైన లక్ష్మీదేవే, ఈయన కాళ్ల దగ్గర కుదురుగా కూర్చొని, కాళ్లు ఒత్తుతోంది, అంటే ఈయన తన అందముతో చంచలమైన లక్ష్మీదేవినే లోబరచుకున్నాడు అనే దృష్టితో చూశారు. ఏ విధమైన వికారముల ప్రభావము లేని, సమానమైన దృష్టి కల చిన్న పిల్లకు ఎలా కనిపిస్తున్నాడో అలానే చూశారు. అందరూ ఒకే శ్రీకృష్ణుడిని చూసినా, వారి, వారి గుణములు, సంస్కారముల ప్రభావములతో వేరు, వేరు

దృష్టితో చూశారు, కాని చూడబడే భగవంతుడు శ్రీకృష్ణుడు ఒక్కడే.

## 16. న చైకచిత్తతంత్రమ్ వస్తు తదప్రమాణకమ్ తదా కిం స్యాత్?

**న చ ఏక చిత్త తంత్రమ్ వస్తు తద్ అప్రమాణకమ్ తదా కిం స్యాత్?** - ఒక చిత్తముతో (మనస్సుతో) ఒక దృష్టితో వస్తువు పుట్టుతుంది, తయారవుతుంది అనే కల్పన సరైనది కాదు. ఒకవేళ ఆ మనస్సు ఆ వస్తువును చూడకపోతే (ఆ వస్తువు యొక్క జ్ఞానము కలగకపోతే), అప్పుడు ఈ వస్తువు యొక్క స్వరూపము ఏమిటి? ఆ వస్తువు లేనట్లా?

మనస్సు ద్వారా వస్తువుల యొక్క జ్ఞానము కలుగుతోంది. చాలా మనస్సులతో (ఒక్కొక్క మనస్సు వేరు, వేరుగా ఆలోచిస్తుంది కాబట్టి) ఒక వస్తువు పుట్టే అవకాశము లేదు. ఒక వ్యక్తి ఒక చెట్టును చూసి, ఆ చెట్టు గురించిన జ్ఞానము అతనికి కలిగింది. తరువాత ప్రక్కన ఉన్న ఒక పుట్టను చూశాడు. అప్పుడు అతనికి ఆ పుట్టను గురించిన జ్ఞానము కలిగింది. ఆ సమయములో ఆ చెట్టు యొక్క జ్ఞానము అతనిలో ఉండదు కాబట్టి, ఆ చెట్టు లేకుండా పోయిందా? ఆ చెట్టును అతను చూడకపోయినా, అక్కడ ఉండనే ఉంది. ఒకవేళ అతను కళ్ళు మూసుకొని ఏమీ చూడట లేదు అని

అనుకుందాము. అప్పుడు ఆ చెట్టు, ఆ పుట్ట (మొత్తము ప్రపంచము) ఉండకుండా పోతుందా? మిగతా వాళ్ళు ఆ చెట్టును, ఆ పుట్టను, ప్రపంచమును చూస్తూ ఉంటారు కదా.

**మనుస్మృతి** – "**లౌకిక పరీక్షకాణాం యస్మిన్ అర్థే బుద్ధి సామ్యమ్ స దృష్టాంతః**" – వస్తువులు ఉన్నాయి అనే శాస్త్రము జ్ఞానము లేనివారైనా, శాస్త్ర జ్ఞానము ఉండి వస్తు తత్త్వమును పరీక్షించాలి అని అనుకునేవారైనా, ఇద్దరు కలిసి ఒక వస్తువును నిర్ణయించుకొని, తరువాత ఆ వస్తువు స్వరూపను నిర్ధారించుకోవాలి. తరువాత దాని స్వరూపమును నిర్ధారించుకోవాలి. శాస్త్ర జ్ఞానము లేనివారు కూడా వస్తువులు ఉన్నాయి అని అంటారు. దానిని పరిగణనలోనికి తీసుకొని, శాస్త్ర జ్ఞానము ఉన్నవాళ్లు పరీక్షించి నిర్ణయము తీసుకోవాలి.

## 17. తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్

**తద్ ఉపరాగ అపేక్షిత్వాత్ చిత్తస్య వస్తు జ్ఞాత అజ్ఞాతమ్** – మనస్సుకి, వస్తువుకి ఇంద్రియముల ద్వారా ఒక సంబంధము ఏర్పడినప్పుడు, దానిని "**ఉపరాగము**" అంటారు. ఆ ఉపరాగము ద్వారా మనస్సు ఆ వస్తువును చూస్తుంది, తెలుసుకుంటుంది.

ఈ సంబంధము కలగకపోతే మనస్సు వస్తువులను తెలుసుకోలేదు.

ఇంద్రియములు వస్తువు దాకా ప్రసరిస్తాయి. మనస్సు కూడా ఇంద్రియములతో వస్తువు దాకా ప్రసరిస్తుంది. అప్పుడు మనస్సుకి, ఆ వస్తువుకి చిత్తోపరాగము అనే సంబంధము ఏర్పడుతుంది. ఆ సంబంధము ద్వారా మనస్సు వస్తువులను తెలుసుకుంటుంది. మనస్సుకు, వస్తువుకు చిత్తోపరాగము అనే సంబంధము కలగకపోతే, మనస్సు వస్తువులను తెలుసుకోలేదు.

వస్తువుల జ్ఞానము తెలుసుకున్నా, తెలుసుకోకపోయినా వస్తువు తన స్థానములో ఉంటుంది. వస్తువు, మనస్సు రెండూ త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి నుండి ఉద్భవించినవే. రెండింటిలోనూ మూడు గుణములు (సత్త్వ, రజో, తమో) ఉన్నాయి. వస్తువు మనస్సుని తెలుసుకోవటలేదు. మనస్సు వస్తువును తెలుసుకుంటోంది. ఇది ఎలా సాధ్యము?

మనస్సు ఒక ఇనుప ముద్దగా పనిచేస్తుంది. వస్తువులు అయస్కాంతముగా పనిచేస్తాయి. అయస్కాంతముగా పనిచేసే వస్తువులు, ఇనుప ముద్దలాంటి మనస్సులను ఆకర్షించి, మనస్సులను తమ దగ్గరకు వచ్చేలా చేసుకుంటాయి. మనస్సు

ఇంద్రియముల సహాయముతో వస్తువుల దగ్గరకు వెళ్ళుతుంది. వస్తువులు, మనస్సు జడమైనవి (జ్ఞానము లేదా తెలివి లేనివి). అటువంటప్పుడు మనస్సు వస్తువులను ఎలా తెలుసుకోగలదు?

మనస్సులో సత్త్వ గుణము శాతము చాలా ఎక్కువగా ఉంటుంది. మిగిలిన రజో గుణము, తమో గుణము యొక్క శాతము తక్కువగా ఉంటుంది. అందుచేత మనస్సు చాలా స్వచ్ఛముగా ఉంటుంది. ఆ స్వచ్ఛత, పారదర్శకము (transparent) కారణముగా, చైతన్య (జ్ఞాన) స్వరూపమైన ఆత్మ, మనస్సులో ప్రతిబింబిస్తుంది. మనస్సుకి ఆత్మ స్వరూపము యొక్క ప్రతిబింబమును గ్రహించే అసాధారణమైన సామర్ధ్యము ఉంది. మనస్సు, ఆత్మ స్వరూపము యొక్క ప్రతిబింబమును గ్రహించి, మనస్సులో పడిన ప్రతిబింబము ద్వారా మనస్సు కూడా ఆత్మ స్వరూపములా వ్యవహరించి (విశేషమైన సంబంధము – చిత్తోపరాగము - దగ్గరగా ఉండుటచేత కలిగే అనురాగము, ఒకరిలా ఒకరు ప్రవర్తించుట), వస్తువులను మనస్సు ప్రకాశింపచేస్తుంది, తెలుసుకుంటుంది.

మనస్సులో క్లేశములు (అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము), అరిషడ్వర్గ ములు (కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము),

సంస్కారములు, అధర్మము మొదలైన మలినములు కారణముగా మనస్సు యొక్క స్వచ్ఛత తగ్గితే, స్పష్టత కోల్పోతే, ఆత్మ స్వరూపము యొక్క ప్రతిబింబము మసక పడి, స్పష్టత తగ్గి వస్తువుల అన్ని విశేషములను గ్రహించలేదు, తెలుసుకోలేదు. అప్పుడు వస్తువులు తెలిసీ, తెలియనట్లు ఉంటుంది. వస్తువులను స్పష్టముగా, ఉన్నది ఉన్నట్లు తెలుసుకోవాలంటే మనస్సులోని మలినములను తొలగించుకోవాలి. మనస్సు ఎంత స్వచ్ఛముగా ఉంటే, ఆత్మ ప్రతిబింబము అంత స్పష్టముగా పడి, వస్తువుల జ్ఞానము, తత్త్వ జ్ఞానము యొక్క స్పష్టత అంత పెరుగుతుంది.

జీవుడు ఈ శరీరము అనే రాజ్యమును పరిపాలిస్తూ, తాను అనేక జన్మలలో చేసిన కర్మల ఫలితములను అనుభవించాలి అనే కార్యములో, తన ప్రధాన ఆంతరంగికుడైన మనస్సును, సేవకులైన ఇంద్రియములను రాజ్యము అనే ఈ ప్రపంచములోకి విడిచిపెట్టి, ఆ సేవకులైన ఇంద్రియములు, ప్రధాన ఆంతరంగికుడైన మనస్సు తీసుకువచ్చి తనకు సమర్పించే భోగములను (సుఖము, దుఃఖము) అనుభవిస్తూ (భోక్త), ఆ భోగముల మీద ఆసక్తి పెంచుకుంటూ, ఆ మనస్సు, ఇంద్రియములు, శరీరము తానే ("**నేను**") అనే భ్రమతో తానే మనస్సు,

మనస్సే తాను, తనకి, మనస్సుకి తేడా లేదు అనే స్థితికి చేరి, తన స్వతసిద్ధమైన అఖండ దివ్యమైన ఆనంద స్వరూపమును మరచిపోయి, ఈ సంసార చక్రములో తిరుగుతూ ఉన్నాడు. జీవుడు భోక్తగా భోగములను అనుభవించకుండా ఉంటే, క్రమక్రమముగా మనస్సు, ఇంద్రియములు తమ, తమ పనులు (ప్రాపించక వస్తువులను, భోగములను తీసుకువచ్చి జీవుడికి సమర్పించుట) మానుకొంటాయి. అప్పుడు జీవుడు తన స్వస్వరూపమైన అఖండ దివ్యమైన ఆనంద అనుభవము పొందుతాడు.

## 18. సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయస్తత్ ప్రభోః పురుషస్యాపరిణామిత్వాత్

**సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయః తత్ ప్రభోః పురుషస్య అపరిణామిత్వాత్** -

**సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయః -** మనస్సులో కలిగే వృత్తులు, పరిణామములు (ఆలోచనలు) జీవుడికి ఎల్లప్పుడూ తెలుస్తూనే ఉంటాయి.

**తత్ ప్రభోః పురుషస్య అపరిణామిత్వాత్** – ఈ చిత్త వృత్తులను అనుభవించే చైతన్య స్వరూపుడైన ప్రభువుకి, పురుషుడికి లేదా జీవుడికి ఏ పరిణామము లేదు. ఆ పురుషుడు తన చైతన్య స్వభావముతో ఈ చిత్త వృత్తులను నిరంతరము తెలుసుకుంటూ ఉంటాడు.

సృష్టిలో ఉండే వస్తువులు, విషయములు మనస్సుతో సంబంధము (ఉపరాగము) కలిగితేనే తెలుసుకోబడతాయి. వస్తువులకు, విషయములకు మనస్సుతో సంబంధము లేకపోతే వాటిని తెలుసుకోలేడు. కాబట్టి వాటికి తెలిసీ, తెలియని స్థితి ఉంటుంది. కాని జీవుడి చైతన్యము, ప్రకాశము నిరంతరము మనస్సు మీద ప్రతిబింబిస్తూ, ప్రకాశింపచేస్తూ ఉంటుంది కాబట్టి, మనస్సులో కలిగే ప్రతీ ఆలోచనలు, పరిణామములు (ప్రకృతి యొక్క మూడు గుణముల స్వభావము) ఏ మార్పులు కలగని జీవుడికి నిరంతరము తెలుస్తూనే ఉంటాయి (సాక్షి).

ప్రకృతి యొక్క మూడు గుణముల ప్రభావముతో మనస్సులోను (చూచుట, వినుట, ఆలోచన, స్మరణము, రాగము, ద్వేషము, కోపము, మొదలైనవి), వస్తువులలోనూ (పుట్టుట, పెరుగుట, మార్పు చెందుట, క్షీణించుట, నాశనము అగుట) నిరంతరము పరిణామములు కలుగుతూనే ఉంటాయి. ఆత్మ తత్త్వమునకు (జీవుడికి) ప్రకృతితో (గుణములతో) ఏ విధమైన సంబంధము లేదు, కాబట్టి ఆత్మ తత్త్వమునకు ఏ విధమైన పరిణామములు, మార్పులు ఉండవు.

ప్రకృతి నుండి పరిణామములు చెందిన ప్రపంచము (మనస్సు, వస్తువులు, విషయములు)

చైతన్యము (జ్ఞానము, ప్రకాశము) లేని, జడ పదార్ధములు. కాబట్టి వస్తువులు మేము ఉన్నాము అని చెప్పలేవు. కాని పురుషుడు (జీవుడు) నిరంతరము స్వయం చైతన్య (జ్ఞాన) ప్రకాశ స్వరూపుడు. కాబట్టి పురుషుడు (జీవుడు) నిరంతరము తాను ప్రకాశిస్తూ, జీవుడికి అతి దగ్గరలో ఉండే మనస్సును ప్రకాశింపచేస్తూ, మనస్సు ద్వారా ఇంద్రియములను, వస్తువులను, విషయములను, తెలియచేస్తూ ఉంటాడు.

జీవుడికి సేవకులైన ఇంద్రియములు, మనస్సు వస్తువుల మరియు విషయముల (భోగ్యములు) ఆలోచనలను తమ ప్రభువైన పురుషుడి (జీవుడి) కోసము లోపలికి తీసుకువచ్చి పురుషుడికి (జీవుడికి) అందిస్తున్నాయి. పురుషుడు (జీవుడు) ఆ భోగములను భోక్తగా అనుభవిస్తున్నాడు.

ప్రభువు = "**ప్రభవతి ఇతి ప్రభువు**" = సమర్ధుడు. అఖండ దివ్యమైన ఆనంద స్వరూపుడైన పురుషుడు (జీవుడు) ఈ ప్రాపించక భోగములకు ఏ సంబంధము లేకుండానే, ఎన్నో రెట్లు దివ్యమైన ఆనందమును అనుభవించగల స్వభావము, సామర్ధ్యము ఉన్నవాడు, అజ్ఞానముతో తాను స్వయం అఖండ దివ్యమైన ఆనంద స్వరూపుడు అనే విషయము మరచిపోయి, మాయ యొక్క భ్రమలో పడి,

తన సేవకులైన మనస్సు, ఇంద్రియములు తెచ్చిపెట్టే తుచ్ఛమైన, క్షణికమైన ప్రాపించక భోగములను అనుభవిస్తూ ఈ సంసార చక్రములోనే తిరుగుతూ ఉన్నాడు. పురుషుడిలో (జీవుడిలో) ఏ విధమైన మార్పు ఉండదు కాబట్టి, తన స్వయం అఖండ దివ్యమైన ఆనంద సామర్థ్యము తనలోనే ఉంది, కాని మాయ యొక్క ఆవరణ కారణముగా ఆ సామర్థ్యము బయటపడట లేదు, అనుభవములోకి రావటలేదు.

**భగవద్గీత – 3-42 – "ఇన్ద్రియాణి పరా ణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః I మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధే పరతస్తు సః", 3-43 – "ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా I జహి శత్రుం మహాబాహూ I కామరూపం దురాసదమ్"** – ద్రవ్యములు, వస్తువులు, విషయములు కంటె ఇంద్రియములు ఉత్తమమైనవి. ఇంద్రియముల కంటె మనస్సు ఉత్తమమైనది. మనస్సు కంటె బుద్ధి ఉత్తమమైనది. వీటిన్నికంటె భిన్నమైనది, వీటితో ఏ సంబంధము లేనిది అతీతమైనది ఆత్మ తత్త్వము (పురుషుడు). ఈ విధముగా ఆత్మ తత్త్వమును తెలుసుకొని, శత్రువు, కామరూపమైన భోగములను జయించవలెను.

**<u>ఉదాహరణ:</u>**

ఒక చిన్న పిల్లవాడికి తల్లి, చంద్రుడు ఆకాశములో వెలుగుతూ, చాలా అందముగా ఉంటాడు అని చెప్పింది. ఆ పిల్లవాడికి చంద్రుడిని చూడాలని కుతూహలము పెరిగింది. ఆ పిల్లవాడు తలెత్తి ఆకాశములోకి చూశాడు. ఆ పిల్లవాడికి చంద్రుడు కనిపించలేదు. అప్పుడు తల్లి, పగటి పూట చంద్రుడు ఆకాశములో ఉన్నా, సూర్యుడి ప్రకాశములో చంద్రుడు కనిపించడు. రాత్రి, సూర్యుడి ప్రకాశము ఉండదు కాబట్టి, చంద్రుడు కనిపిస్తాడు అని చెప్పింది. ఆ పిల్లవాడు రాత్రి తల పైకెత్తి ఆకాశములోకి చూసి, ఆకాశములో చాలా చంద్రులు ఉన్నారు అని అన్నాడు. అప్పుడు తల్లి నీవు చూస్తున్నది చంద్రులు కాదు, అవి నక్షత్రములు. ఆకాశములో అన్నిటి కంటె పెద్దగా వెలుగుతూ, వెన్నెలను వెదజల్లుతూ ఉండేవాడు ఒక్కడే చంద్రుడు, అని చెప్పింది. అప్పుడు ఆ పిల్లవాడు చంద్రుడిని చూడగలిగాడు.

ఎలాగైతే చంద్రుడిని చూడటానికి, సూర్యుడి ప్రకాశమును, నక్షత్రములను, గ్రహములను తొలగిస్తే కేవలము ఒక్క చంద్రుడినే చూడగలమో, అలాగే జీవుడిని ("**నేను**") మాయతో ఆక్రమించి ఉన్నందున లీలగా, అస్పష్టముగా తెలిసే వారి జీవాత్మ, వారికి శుద్ధమైన స్వరూపముతో కనిపించుటలేదు. మాయ

యొక్క పదార్థములతో (త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి యొక్క మూడు గుణములు, మహతత్త్వము, అహంకారము, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, శరీరము, సంస్కారములు, కర్మలు, కర్మ ఫలితములు) కలగవలసిన జీవుడిని "**నేను**" అని భావిస్తూ ఉంటారు. ఏ ఇతర పదార్థములతో కలవకుండా ఉండే శుద్ధమైన కేవలమైన ఆత్మ తత్త్వమును తెలుసుకోవాలంటే మెట్లు మెట్లుగా మాయ యొక్క పదార్థములను వీటన్నిటినీ తొలగించి చూడాలని ఈ పాదములో 18 సూత్రముల వరకూ వివరించారు.

## 19. నతత్స్వాభాసమ్ దృశ్యత్వాత్

**న తత్ స్వాభాసమ్ దృశ్యత్వాత్** - మనస్సు తనంతట తాను ప్రకాశిస్తూ, ఇతర వస్తువులను ప్రకాశింపచేసే వస్తువు కాదు. మనస్సు దృశ్యమైన ఒక వస్తువు.

మనస్సు స్వప్రకాశము కాదు. మనస్సు కూడా విజ్ఞానముతో తెలుసుకోబడే వస్తువు. 13 వ సూత్రములో **తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః** – బుద్ధి, మనస్సు ఇంద్రియములు, శరీరము, వస్తువులు, విషయములు త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి యొక్క పరిణామములు. ఇవన్నీ జడ పదార్థములు. కాబట్టి స్వప్రకాశములు కావు. వీటన్నిటికీ ప్రభువు ఆత్మ

స్వరూపము. ఇవన్నీ వాటి ప్రభువైన ఆత్మ స్వరూపమునకు భోగములు (సుఖము, దుఃఖము) అందించుటకు నిరంతరము పనిచేస్తున్నాయి.

“**నేను**” సుఖముగా ఉన్నాను, “**నేను**” బాధ పడుతున్నాను, అని మనస్సులో ఆలోచన కలుగుతుంది. ఈ వాక్యములలో ఉండే “**నేను**” అర్థము “**అహం**” అనగా అహంకారము యొక్క ఆలోచన. ఈ అహంకారము త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి యొక్క పరిణామమే. అందుచేత ఈ మనస్సు స్వప్రకాశము కాదు. మనస్సు దృశ్యమైన ఒక వస్తువు.

## 20. ఏకసమయే చోభయఽనవధారణమ్

**ఏక సమయే చ ఉభయ అనవధారణమ్** - ఒకే సమయములో ఇటు మనస్సు, అటు వస్తువు/విషయము రెండూ తెలిసేందుకు అవకాశము లేదు. అందుచేత మనస్సు స్వప్రకాశము కాదు.

### <u>ఉదాహరణ – శుక మహర్షి:</u>

శ్రీ శుక మహర్షి వేద వ్యాసుడికి కుమారుడిగా జన్మించారు. వేద వ్యాసుడు వివాహము చేసుకోలేదు కాబట్టి, శుక మహర్షికి తల్లి లేదు. శుక మహర్షి కారణ జన్ముడు, పరమేశ్వరుడి అనుగ్రహముతో పుట్టినవాడు. కాబట్టి పుట్టిన వెంటనే 6 సంవత్సరముల కుమారుడిగా

పెరిగాడు. వేద వ్యాసుడు పరమేశ్వరుడిని ప్రార్థించి, తన కుమారుడికి ఉపనయనము చేయమని ప్రార్థించాడు. పార్వతీ పరమేశ్వరులు వచ్చి, పిల్లవాడైన శుక మహర్షికి ఉపనయనము చేసి, తత్త్వ జ్ఞానము (బ్రహ్మ, జీవుడు గురించి) ఉపదేశము చేశాడు. తరువాత వేద వ్యాసుడు, తన కుమారుడి విద్యాభ్యాసము కొరకు బృహస్పతి దగ్గరకు పంపాడు. శ్రీ శుక మహర్షి బృహస్పతి దగ్గర విద్యాభ్యాసము పూర్తి చేసుకుని, తండ్రి దగ్గరకు వచ్చి, **"కిం కర్తవ్యమ్"** అని అడిగాడు. అప్పుడు వేద వ్యాసుడు మరికొన్ని ఉపదేశములు కూడా బోధించాడు. శుక మహర్షికి తత్త్వ జ్ఞానము కలిగిందని గుర్తించాడు. ఆ తత్త్వ జ్ఞానము బలపడి, స్థిరపడుటకు నీవు జనక మహారాజు దగ్గరకు వెళ్లి ఆయన దగ్గర కూడా కొన్ని ఉపదేశములు పొందాలి అని చెప్పి, శుక మహర్షిని జనక మహారాజు దగ్గరకు పంపాడు. శుక మహర్షి కౌపీనము ఒక్కటే ధరించి, జనక మహారాజు ఉండే రాజ భవనము వెళ్ళాడు. అక్కడ ద్వారపాలకులు ఈ పిల్లవాడిని అడ్డగించారు. ద్వారపాలకులు లోపలి పంపలేదని ఏమీ అనుకోకుండా, శుక మహర్షి అక్కడే ఒక స్తంభమునకు ఆనుకొని, ధ్యానములో నిమగ్నమై ఉన్నాడు. అలా రెండు రోజుల తరువాత, ఆ ద్వారపాలకుల పై అధికారి, ఈ పిల్లవాడి గురించి జనక మహారాజుకు తెలిపి,

ఆయన ఆజ్ఞ తీసుకొని, రాజ భవనములో అంతఃపురములో ఒక గదిలో ఉంచి, సకల భోగములు ఏర్పాటు చేశారు. రాజ మర్యాదలు, ఉపచారములు జరుగుతున్నాయి. అలా రెండు రోజులు గడిచింది. శుక మహర్షి ఆ రాజ భోగములు, మర్యాదలు, ఉపచారములను పట్టించుకోకుండా, తన ధ్యానములోనే తాను ఉన్నాడు. ఈ విషయము జనక మహారాజు కనిపెడుతూనే ఉన్నాడు. జనక మహారాజు పూర్తిగా నీళ్ళు నింపిన చెంబును నెత్తి మీద పెట్టుకొని, భాజా భజంత్రీలతో వచ్చి, శుక మహర్షి కాళ్లు కడిగి, తన నెత్తి మీద జల్లుకొని, తాను శుక మహర్షికి పాదాభివందనము చేసి, తన రాజ పరివారమును అందరినీ కూడా శక మహర్షికి పాదాభివందనము చేయమన్నాడు. జనక మహారాజు శుక మహర్షి మనస్సులో ఏమైనా వికారములు (అహంకారము, గర్వము) కలుగుతోందా అని పరీక్షిస్తూ ఉన్నాడు. శుక మహర్షి మనస్సులో ఏ విధమైన చిన్నపాటి వికారము కలగలేదని తెలుసుకొని, మిగిలిన వాళ్ళందరినీ పంపించేసి, శుక మహర్షిని ఒక ఆసనము మీద కూర్చోపెట్టి, మీ నాన్నగారు నిన్ను, నా దగ్గరకు ఎందుకు పంపారో నాకు తెలుసు. నీవు సుఖ దుఃఖములు, మాన అవమానములు (ద్వంద్వములను) అధికమించావు నీకు తత్త్వ

జ్ఞానము కలిగి, అనుభవములోకి వచ్చింది. ఒకసారి తత్త్వ జ్ఞానము కలిగిందని, సాధన వదిలేస్తే అది స్థిరముగా ఉండకుండా జారిపోతుంది. ఈ జ్ఞానము మనస్సులో ఉండే సంస్కారములు, క్లేశములు ప్రభావముతో ఎప్పుడు జారిపోతుందో తెలియదు. జ్ఞానము మనస్సులో స్థిరపడుటకు సందేహములను పోగొట్టుకోవటానికి ప్రతిరోజూ మననము, జ్ఞానము బలపడటానికి ధ్యానము, నిదిధ్యాసనము (మరి, మరి తలుచుకొనుట) చేస్తూ ఉండాలి. ఇంకా చాలా సాధనములను బోధించి, నేను నీకు చెప్పవలసినది అంతా చెప్పేశాను. నీవు మీ తండ్రి దగ్గరకు వెళ్ళు, అని చెప్పి పంపించాడు. శుక మహర్షి తన తండ్రి దగ్గరకు వెళ్లి **"కిం కర్తవ్యమ్"** అని అన్నాడు. అప్పుడు వేద వ్యాసుడు, శుక మహర్షిని తన ప్రక్కన కూర్చోమని, ధ్యానము మొదలుపెట్టాడు. శుక మహర్షి కూడా ధ్యానము చేస్తున్నాడు. అప్పుడు అశరీరవాణి ఈ పర్వతము మీద ఎప్పుడూ వేద అధ్యయనము జరుగుతూ ఉండాలి, కాబట్టి వేద అధ్యయనము చేయండి అని చెప్పింది. అప్పుడు ఇద్దరూ వేద అధ్యయనము మొదలుపెట్టారు. మధ్యలో వేద వ్యాసుడు మధ్యాహ్నిక స్నానము అనే వంక పెట్టి ఆకాశ గంగకు వెళ్ళాడు. శుక మహర్షి ఏకాంతముగా, ఏకాగ్రతతో వేద అధ్యయనము చేస్తూ ఉన్నాడు. ఇంతలో సనత్

కుమారులు వచ్చారు. శుక మహర్షి సనత్ కుమారులను నమస్కారము చేసి, ఏదైనా మంచి విషయములు చెప్పండి అని అడిగాడు. సనత్ కుమారులు, శుక మహర్షికి చాలా విస్తృతముగా ఉపదేశములు చేశారు. ఆ ఉపదేశములను అందుకుంటున్న శుక మహర్షి పై, పై స్థాయికి వెళ్ళుతూ, సర్వ భూతమయముగా మారిపోయాడు. అప్పుడు శ్రీ శుక మహర్షి, నా తండ్రికి నా మీద పుత్ర ప్రేమ, అభిమానము ఉంది, ఆయన వచ్చి నా గురించి అడుగుతాడు. వారికి నేను ఈ దిశగా వెళ్ళాను అని చెప్పండి అని అక్కడ ఉన్న చెట్లకి, పుట్లకి చెప్పాడు. శ్రీ శుక మహర్షి ఆకాశ స్వరూపముగా మారి వైకుంఠ చేరి, శ్రీమన్నారాయణుడు దగ్గర కూడా ఉపదేశములు పొంది, తత్త్వ జ్ఞానమును స్థిర పరచుకొని, భూలోకమునకు తిరిగి వచ్చి, అర్హులకు భక్తితో కూడిన జ్ఞానమును (మహా భాగవతము) ఉపదేశములు చేశారు.

## 21. చిత్తాంతరదృశ్యే బుద్ధిబుద్ధేరతిప్రసంగః స్మృతిసంకరశ్చ

**చిత్తాంతర దృశ్యే బుద్ధిబుద్ధేర్ అతిప్రసంగః స్మృతి సంకరశ్చ** -

**చిత్తాంతర దృశ్యే** - మొదటి క్షణములో పుట్టిన విజ్ఞానము వస్తువులను తెలియచేస్తే, రెండవ

క్షణములో పుట్టిన విజ్ఞానము, మొదటి క్షణములో పుట్టిన విజ్ఞానము దృశ్యము అవుతుంది. (రెండవ క్షణములో పుట్టిన విజ్ఞానము మూడవ క్షణములో పుట్టిన విజ్ఞానముతో తెలుస్తుంది - అలా మూడవ క్షణములో పుట్టిన విజ్ఞానము నాలుగవ క్షణములో పుట్టిన విజ్ఞానముతో తెలుస్తుంది – ఇది ఇలా ఒకదాని తరువాత మరొకటి సాగిపోతూనే ఉంటుంది) – ఇది బౌద్ధ మతము సిద్ధాంతము.

**బుద్ధిబుద్ధేర్ అతి ప్రసంగః** – ఏ విజ్ఞానము "**నేను**" ఉన్నాను అని తనని తాను తెలియచేయుట లేదు. ఇది ఇలా నిరంతర ప్రవాహములాగ సాగిపోతూనే ఉంటే, ఈ ధార ఎప్పటికీ ఆగిపోవటానికి వీలులేదు. దీనిని "**అనవస్థా**" – స్థితి లేకపోవుట – దీనిలో అతి ప్రసంగము అనే దోషము ఉంది.

**స్మృతి సంకర శ్చ** – ఈ విజ్ఞాన ధారను అంగీకరిస్తే, ఒక్కొకక్క విజ్ఞానముతో ఒక్కొకక్క సంస్కారము పుట్టుకు వస్తే, ఈ అనంత విజ్ఞాన సంస్కారములలో, ఏ సంస్కారము ద్వారా ఏ స్మృతి కలుగుతోందో తెలియని పరిస్థితి ఏర్పడ్తుంది. అప్పుడు స్మృతి సంకరము (బేధము తెలియని) అనే దోషము కూడా ఏర్పడుతుంది. **శ్చ** = ఆత్మను, మనస్సుతో కలిపేశారు. అప్పుడు ఆత్మ, మనస్సు, విజ్ఞానము ఒక్కటే అయిపోతుంది. దానితో ఆత్మ వేరు, మనస్సు

వేరు అనే సంకరము (బేధము తెలియని) పరిస్థితి ఎర్పడలేదా?

ఉదాహరణకు, మనకు పది విజ్ఞానములు ఉన్నాయి అని అనుకుంటే, మొదటి విజ్ఞానము రెండవ విజ్ఞానము ద్వారా తెలిసింది. ఇలా తొమ్మిదవ విజ్ఞానము పదవ విజ్ఞానము ద్వారా తెలిసింది. తరువాత పదవ విజ్ఞానము దేని ద్వారా తెలియాలి? ఒకవేళ ఈ ధార ఇలా సాగిపోతూ ఉంటే, ఈ ధార, ప్రవాహము ఎక్కడ ఆగుతుంది?

దీనికి బౌద్ధుల సమాధానము ఈ క్షణిక విజ్ఞాన ధార ఎప్పటికీ ఆగదు. ఈ విజ్ఞాన ధారతో లోక వ్యవహారము, సంసారము) సాగుతుంది. ఈ విజ్ఞాన ధారకు ఐదు స్కంధము ఉంటాయి:

**1. రూప స్కంధము** – విజ్ఞానములు ఒకదాని వెంట మరొకటి పుట్టుకు వస్తాయి. ఈ విజ్ఞానములు రూపములను (వస్తువులను) తెలియచేస్తాయి. ఇది మెలకువగా ఉన్నప్పుడు (జాగృతి స్థితిలో) పనిచేస్తుంది.

**2. విజ్ఞాన స్కంధము** - ఈ విజ్ఞాన స్కంధము వస్తువులను తెలియ చేయదు. కేవలము "**అహం**" – "**నేను**" అని తనని తాను తెలియచేస్తుంది. ఇది నిద్రపోతున్నప్పుడు (సుషుప్తి స్థితిలో) పనిచేస్తుంది. ఈ

రెండూ ఒకదాని తరువాత మరొకటి సాగిపోతూనే ఉంటుంది.

**3. వేదన స్కంధము** – పై రెండింటి స్కంధముల వలన ఈ వేదన (సుఖ, దుఃఖ అనుభవము) స్కంధము ఏర్పాటు అవుతుంది.

**4. సంజ్ఞా స్కంధము** - ఈ సంజ్ఞా స్కంధము ద్వారా ప్రతి వస్తువును ఒక పేరుతో పిలవటము జరుగుతుంది.

**5. సంస్కార స్కంధము** - ప్రతి విజ్ఞానము ద్వారా సంస్కారము పుట్టుకు వస్తుంది. ఈ సంస్కారము, దీని తరువాత కలిగే విజ్ఞానములో జమ అవుతుంది. దీని తరువాత కలిగే విజ్ఞానములో రెండవ విజ్ఞానము మరియు మొదటి విజ్ఞానముతో కలిగిన సంస్కారము కలిపి జమ అవుతుంది. ఇలా విజ్ఞానములు, సంస్కారములు వరసగా కలిసిపోతూ, సాగిపోతూ ఉంటుంది.

**బాదరాయణ మహర్షి బ్రహ్మ సూత్రములలో – ద్వితీయ అధ్యాయము - ద్వితీయ పాదము - 4. సముదాయాధికరణమ్** – ఈ క్రింద ఆరు సూత్రములలో ఇదే విషయమును ఖండించి నిరూపించారు.

**18. సముదాయ ఉభయహేతుకేపాపి తదప్రాప్తిః**

**19. ఇతరేతర ప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తిమాత్ర నిమిత్తత్వాత్**

**20. ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్**

**21. అసతి ప్రతిజ్ఞోపరోధోయౌగ పద్యమన్యథా**

**22. ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యానిరోధాప్రాప్తి రవిచ్ఛేదాత్**

**23. ఉభయథా చ దోషాత్**

**<u>ఉదాహరణ:</u>**

జైమిని మహర్షి, వేద వ్యాసుడి ప్రాథమిక శిష్యులలో ఒకరు. వేద వ్యాసుడు నుండి జైమిని మహర్షికి సామవేదము (1000 శాఖలు) నేర్చుకొని ప్రచారము చేసినవాడు. వేదములో చెప్పిన కర్మాచరణ ఎలా చేయాలి, దానికి కావలసిన న్యాయ విచారణ ఎలా చేయాలి అని వివరించే పూర్వ మీమాంస (1000 అధికరణములు) లేదా కర్మ మీమాంస దర్శనమును వ్రాసినవాడు. ఆయనకు కొన్ని సందేహములు కలిగాయి. ఆ సందేహములను తీర్చుకుందుకు మార్కండేయ మహర్షి (చిరంజీవి, ఎన్నో కల్పములను

చూసినవాడు) దగ్గరకు వెళ్లి, తన సందేశములను తీర్చమని ప్రార్థించాడు. మార్కండేయ మహర్షి, నేను అనుష్టానము, యాగములో మొదలైన పనులతో ఉన్నాను. నాకు నీ సందేహ,ములు తీర్చే ఖాళీ, సమయము లేదు. కొంత దూరములో నాలుగు పక్షులు ఉన్నాయి. ఆ పక్షులు ఎన్నో జన్మల పాటు జ్ఞాన సముపార్జన చేసిన పక్షులు. వాటికి అన్నీ తెలుసు. ఏదో శాప కారణముగా ఇలా పక్షులుగా ఉన్నాయి.

పూర్వము వసువు అనే అప్సరస ఉండేది. ఆ అప్సరస ఏదో తప్పుచేసి, దూర్వాస మహర్షికి కోపము తెప్పించింది. దానికి దూర్వాస మహర్షి ఆ అప్సరను నీవు పక్షి అయిపో అని శపించారు. అప్పుడు ఆ అప్సరస పశ్చాత్తాపము పడి, శాప విమోచనము చెప్పమని ప్రార్థించింది. దూర్వాస మహర్షి అకారణముగా అలా శాపములు ఇవ్వడు. దాని వెనుక ఏదో దైవ నిర్ణయము ఉంటుంది. అయినా ఆయన శాంతించి, నీకు అర్జునుడి బాణము తగిలినప్పుడు, నీకు శాప విమోచనము కలుగుతుంది అని చెప్పాడు. ఆ పక్షి జన్మలో తనకు నలుగురు పిల్లలు కూడా పుడతారు అని చెప్పాడు. ఆ వసువు అనే అప్సరస పక్షిగా జన్మ ఎత్తింది. అప్పుడు మహాభారతము యుద్ధము జరుగుతోంది. ఆ యుద్ధము మధ్యలో ఒక ఏనుగు చుట్టూ ఈ పక్షి ఎగురుతోంది. ఆ యుద్ధములో అర్జునుడి

ఆ ఏనుగు మీద ఉన్న యోధుడి మీదకు వేసిన బాణము వచ్చి, ఈ పక్షికి తగిలింది. ఆ సమయములో ఆ పక్షి గర్భములో నాలుగు గుడ్లు ఉన్నాయి. ఆ గుడ్లు భూమిమీద పడ్డాయి. ఆ ఏనుగుకు మేడలో కట్టిన గంట ఆ గుడ్లమీద పడి ఆ గుడ్లు రక్షణ కలిగించింది. తరువాత తల్లి పక్షి క్రింద పడి మరణించింది. ఆ తల్లి పక్షికి శాప విమోచన కూడా అయిపోయింది. ఆ యుద్ధము పదవ రోజున భీష్ముడు, అర్జునుడి బాణములకు పడిపోయాడు. భీష్ముడికి అంపశయ్య ఏర్పాటు చేశారు. భీష్ముడి అంపశయ్య ఎవరికీ తెలియకుండానే ఆ నాలుగు గుడ్లను రక్షిస్తున్న గంట మీద ఏర్పాటు చేయబడినది. ఆ గంట క్రింద గుడ్లు పెరుగుతున్నాయి. ఆ గుడ్ల నుండి పుట్టిన అసాధారణమైన ఆ పక్షి పిల్లలు క్రమక్రమముగా మానవులు మాట్లాడే మాటలు వినగలుగుతున్నాయి. మహాభారతము యుద్ధము అంతమైన తరువాత, అంపశయ్య మీద ఉన్న భీష్ముడు, ధర్మరాజుకు ఎన్నో ధర్మ ఉపదేశములు, రాజ పాలనా విధానములను, తత్త్వములను, విష్ణు సహస్ర నామములు, శివ సహస్ర నామములు ఉపదేశము చేశాడు. భీష్ముడు, ధర్మరాజుకు చేసిన ఉపదేశములు అన్నీ ఈ నాలుగు పక్షులు జాగ్రత్తగా విన్నాయి. తరువాత ఉత్తరాయణము వచ్చినప్పుడు భీష్ముడు తన జన్మ చాలించాడు.

తరువాత ఆ అంపశయ్యను కూడా తీసేశారు. తరువాత ఆ ప్రదేశమును ఎవ్వరూ పట్టించుకోలేదు.

కొన్నాళ్ళ తరువాత శమీక మహర్షి అటువైపు నుండి వెళ్ళుతున్నాడు. ఆయన ఆ గంటను, దాని క్రింద పక్షుల కిలకిల ధ్వనులు విన్నాడు. ఆయన ఆ గంటను తొలగిస్తే, నాలుగు పక్షి పిల్లలు చూసి ఆశ్చర్య పోయి, ఇది పరమేశ్వరుడి లీల అని అనుకొని, ఆ నాలుగు పక్షి పిల్లలను తన ఆశ్రమమునకు తీసుకువెళ్లాడు. కొన్ని రోజులకు ఈ పక్షులు మానవ భాషలో మాట్లాడుతున్నాయి. క్రిందటి జన్మలో మేము సుకుర్షుడు మహర్షి కుమారులము. మా పేర్లు – 1. పింగాక్షుడు, 2. విరాటుడు, 3. వృత్రుడు, 4. సుముఖుడు. మా తండ్రి మాకు అన్ని రకముల విద్యలు బోధించారు. ఒకరోజు త్యాగము యొక్క గొప్పతనము బోధిస్తూ "**త్యాగాత్ శాంతి అనంతరమ్**" – త్యాగముతో ఏమైనా సాధించగలము. త్యాగము మోక్షమునకు మూలము అని చెప్పుతూ ఉండగా, ఇంద్రుడు గ్రద్ధ రూపములో వచ్చి, నాకు నర మాంసము తినాలని ఉంది. మీలో ఎవరైనా మీ శరీరమును నాకు త్యాగము చేస్తారా? అని అడిగాడు. అప్పుడు మా తండ్రిగారు, త్యాగము యొక్క గొప్పతనము గురించి చెప్పుతున్నాను కదా। మీకు నా బోధ అర్థమైతే మీలో ఎవరైనా మీ శరీరమును త్యాగము

చేయండి అని మాతో అన్నారు. అప్పుడు మేము మీ పాఠము సరిగ్గా అర్ధము కాలేదు. మేము శరీరమును ఎలా త్యాగము చేయగలము? అని అబద్ధము ఆడాము. దానికి మా తండ్రికి కోపము వచ్చి, మమ్మలను పక్షులుగా అవ్వాలని శపించారు. తరువాత మా తండ్రి ఆ గ్రద్ధతో నేను నా శరీరమును నీకు త్యాగము చేస్తున్నాను. నన్ను తిను అని అన్నారు. అప్పుడు ఆ గ్రద్ధ నేను జీవించి ఉన్న వాళ్లను తినను. నీవు నీ ప్రాణములను వదిలితే, అప్పుడు నీ చనిపోయిన శరీరమును తింటాను అని అంది.  అప్పుడు మా తండ్రిగారు పద్మాసనము వేసుకొని, యోగ శక్తితో తన ప్రాణములను వదిలేస్తూ, నా ప్రాణము పోయిన తరువాత నా శరీరమును తిను అని ప్రాణములను వదులుతూ ఉండగా, వెంటనే  ఆ గ్రద్ధ ఇంద్రుడి రూపము దాల్చి, నీవు నీ ప్రాణములను వదిలిపెట్టవద్దు. నీ ప్రాణములను నీ శరీరములో మరలా ప్రవేశపెడుతున్నాను. త్యాగములో నీ అంతటి మహానుభావుడు ఈ సృష్టిలో లేడు అని ప్రపంచమునకు తెలియ చేయుటకే నేను ఈ విధముగా నిన్ను పరీక్షించాను. నీ అంతటి గొప్పవాడికి  నేను ఇవ్వగలిగినది ఏదీ లేదు, అని చెప్పి అదృశ్యమైపోయాడు. మిమ్మల్ని క్షమించమని, మాకు శాప విమోచనము చెప్పమని  మా తండ్రి కాళ్ల మీద

పడ్డాము. అప్పుడు మా తండ్రిగారు, ప్రాణులకు శరీరము మీద వ్యామోహము ఉంటుంది. మీరు ఈ జన్మలో నేర్చుకున్న విద్య, జ్ఞానము మీ పక్షి జన్మలో కూడా ఉంటుంది. మీ పక్షి జన్మలో భీష్ముడు, ధర్మరాజుకు చేసే ధర్మ ఉపదేశములు కూడా నేర్చుకునే భాగ్యము కలుగుతుంది. జైమిని మహర్షి మీ దగ్గరకు వచ్చి ఆయన సందేహములను అడిగినప్పుడు, మీరు ఆయన సందేహములను తీర్చినప్పుడు మీకు శాప విమోచనము అవుతుంది అని చెప్పారు. మీరు మిమ్మల్ని ఆ గంట నుండి విముక్తి చేసి, మీ ఆశ్రమమునకు తీసుకువచ్చి, మీ వేద పఠనముతో మాకు జ్ఞాన భిక్ష కూడా పెడుతున్నారు. అందుచేత మీరు మాకు తండ్రి మరియు గురువు కూడా అని చెప్పాయి.

మార్కండేయ మహర్షి, జైమిని మహర్షితో నీవు ఆ పక్షుల దగ్గరకు వెళ్లి, వాటిని నీ సందేహములను తీర్చమని అడుగు. అవి నీ సందేహములను తప్పకుండా తీరుస్తాయి అని చెప్పాడు. జైమిని మహర్షి ఆ పక్షుల దగ్గరకు వెళ్లి, తన సందేహములను అడిగాడు. ఆ పక్షులు ఆ సందేహములను అన్నిటినీ తీర్చి, ఆత్మ తత్త్వము గురించి కూడా వివరించి వాటి శాప విముక్తిని పొందాయి.

**కఠోపనిషత్ – 1-2-9 – "నిషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తా2న్యే నైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ I యాం త్వమాపః సత్యధ్రుతిర్బతాపి త్వాదృగ్ నో భూయా న్న చేకేతః ప్రష్టా"** – ఆత్మ తత్త్వ జ్ఞానము తర్కము, ఊహల ద్వారా పొందలేరు. ఎవరైతే ఆత్మ తత్త్వము తెలుసుకోవాలని జిజ్ఞాసతో నిరంతరము ప్రయత్నము చేసి, ఆత్మ తత్త్వము అనుభవము కలిగిన సద్గురువు ద్వారా ఉపదేశము పొందినవారు మాత్రమే సులభముగా తెలుసుకోగలరు.

## 22. చిత్తేరప్రతిసంక్రమాయాస్తదాకారాపత్తౌ స్వబుద్ధిసంవేదనమ్

బౌద్ధులు చెప్పిన క్షణిక విజ్ఞాన పరంపర సాగుతూ ఉంటుంది. ఆ పరంపరలో మొదటి విజ్ఞానము దృశ్యమును తెలియచేస్తుంది. రెండవ విజ్ఞానము మొదటి విజ్ఞానమును తెలియచేస్తుంది. ఇలా ఈ విజ్ఞాన ధార కొనసాగుతూ ఉంటుంది. దీనికి అంతము ఉండదు. మేము చెప్పిన దానిని ఏ విధముగా అర్ధము చేసుకున్నారో చెప్పట లేదు, మేము చెప్పిన వాటిలో దోషములు చెప్పుతున్నారు, కాని మీ అభిప్రాయము ఏమిటో చెప్పట లేదు, అని బౌద్ధులు మహర్షిగారిని అడిగారు, దానికి మహర్షిగారు ఈ సూత్రములో ఇలా జవాబు చెప్పుతున్నారు –

**చిత్తేర్ అప్రతి సంక్రమాయాః స్తదాకార ఆపత్తౌ స్వబుద్ధి సంవేదనమ్** – బుద్ధిలో లేదా మనస్సులో సత్త్వ గుణము శాతము ఎక్కువగా, మిగిలిన రజో గుణము, తమో గుణము శాతము తక్కువగా ఉంటుంది. అందుచేత బుద్ధి లేదా మనస్సు స్పటికము లేదా అద్దము వలె స్వచ్ఛమైన పదార్థము. స్వచ్ఛమైన మనస్సులో ఆత్మ చైతన్యము (జ్ఞానము) యొక్క ప్రతిబింబము ఏర్పడుతుంది. ఆత్మ చైతన్యము ప్రతిబింబముగా ఉన్న మనస్సు, ఆ ప్రతిబింబముతో కలిసి ఇంద్రియముల ద్వారా బయటకు వెళ్లి, వస్తువులు లేదా విషయములతో సంబంధము ఏర్పడినప్పుడు, మనస్సులో ఉండే ఆత్మ చైతన్య ప్రతిబింబము యొక్క ప్రకాశముతో, ఆ వస్తువులను, విషయములను తెలియచేస్తుంది. మనస్సు జడ పదార్థము కనుక, తనంతట తాను ఏమీ తెలియచేయలేదు. మనస్సు మధ్యవర్తిగా మాత్రమే పనిచేస్తుంది. మనస్సులో ఏర్పడిన ఆత్మ చైతన్యము యొక్క ప్రతిబింబమే వస్తువులను, విషయములను తెలియచేస్తుంది.

ఆత్మ యొక్క చైతన్య శక్తి మనస్సుకు యొక్క పరము అవదు, కలగదు. ఆత్మ చైతన్య శక్తి ఎప్పుడైతే బుద్ధిలో లేదా మనస్సులో ప్రతిఫలిస్తుందో, అప్పుడు ఆ చైతన్య ప్రతిబింబమునకు, బుద్ధి వృత్తికి బేధము

తెలియదు.  అప్పుడు సామాన్య దృష్టికి బుద్ధి లేదా మనస్సు స్వప్రకాశములాగా (తనంతట తాను వెలుగుతూ, మిగిలిన వస్తువులను వెలిగిస్తున్నట్లు) అనిపిస్తుంది.

ఎవరి సమాధానము అనాది వేద వాఙ్మయము, గురు పరంపర ఆధారముగా ఉంటుందో వారి సమాధానమును అంగీకరించాలి.

**కఠోపనిషత్ – 1-3-12 – "ఏష సర్వేషు భూతేషు, ఘూఢో22త్మా న ప్రకాశతే । దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా, సూక్ష్మయా సూక్ష్మదర్శభిః"** – అన్ని ప్రాణుల శరీరములో ఉండే ఆత్మ తత్త్వము, బయటకు స్పష్టముగా తెలియట లేదు. ఆత్మ తత్త్వము యొక్క చైతన్య ప్రతిబింబము జడమైన బుద్ధి మీద పడి, బుద్ధి కూడా ఆత్మ తత్త్వము వలె ప్రకాశిస్తుంది. ప్రకాశిస్తున్న బుద్ధిని మాత్రమే మనము గమనిస్తున్నాము, కాని ఆ బుద్ధిని వెలిగిస్తున్న ఆత్మ తత్త్వమును మనము గమనించుట లేదు. బయటకు తెలిసేది బుద్ధి వృత్తి మాత్రమే. ఏకాగ్రతతో ఆ బుద్ధి వృత్తి ద్వారా (అతి సూక్ష్మ దృష్టితో ఆ బుద్ధి మీద పడిన ప్రతిబింబమును పట్టుకొని, ఆ ప్రతిబింబము యొక్క బింబమును పట్టుకొని) లోపల నిగూఢముగా ఉండే ఆత్మ తత్త్వమును తెలుసుకోవాలి.

**ముండకోపనిషత్ – 3-1-8 – "జ్ఞాన ప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః"** - ఆత్మ జ్ఞానముతో పరిశుద్ధమైన అంతఃకరణము కలవాడై, పరబ్రహ్మను నిరాకారముగా ధ్యానించువారు మాత్రమే ఆత్మ తత్త్వమును దర్శించగలరు.

**శాస్త్రము - "న పాతాళం న చ వివరం గిరీణామ్ నైవాంధకారమ్ సుక్షయో నోదరీణామ్ గుహాయిస్యామ్ నిహితం బ్రహ్మ శాశ్వతం బుద్ధి వృత్తిం అవిశిష్టామ్ సవయో వేదయంతే"** - బుద్ధి వృత్తికి, మనస్సుకి, మనస్సు యొక్క పరిణామములకు, ఆత్మ తత్త్వమునకు ప్రాథమికముగా ఏ బేధము కనిపించదు. మనస్సు తప్ప ఇంకేమీ లేదు అని అనిపిస్తుంది. మనస్సే ఆత్మ అని కూడా అనిపిస్తుంది. ఆత్మ, మనస్సు ఒకటిగా కలిసిపోయి ఉంటుంది. కాని అదే బుద్ధి వృత్తిలో ఆత్మ తత్త్వము కలిపేసుకొని, తనని తాను తెలియకుండా బుద్ధి వృత్తిలో దాక్కుని ఉంది.

ఉపనిషత్తులు, సిద్ధాంతములు చెప్పిన విధముగా బుద్ధి వృత్తి నుండి ఆత్మ తత్త్వమును విడదీసి తెలియచేస్తున్నాము.

**<u>ఉదాహరణ:</u>**

ప్రహ్లాదుడు తల్లి గర్భములో ఉండగానే నారదుడి ద్వారా ఎన్నో ఉపదేశములు పొందినవాడు. భక్తిలో అంతిమ స్థాయికి చేరుకున్నవాడు. తన కోసము శ్రీహరి ఒక అవతారము ఎత్తి, నరసింహస్వామి దర్శనము కలిగి, ఆయన దగ్గర నుండి ఆశీర్వాదము పొందినవాడు. తరువాత తండ్రి స్థానములో రాజ్య పరిపాలన చాలా ధార్మికముగా, సాత్వికముగా పరిపాలించినవాడు. నిరంతరము శ్రద్ధగా, భక్తితో శ్రీహరి చింతనతోనే జీవితము గడిపినవాడు. కాని ప్రహ్లాదుడికి ఒక చింత మిగిలిపోయింది. సాక్షాత్ శ్రీహరి దర్శనము అయిన తరువాత కూడా, తనకు విదేహ కైవల్యము ఎందుకు కలగలేదు? వయస్సు పెరిగిన తరువాత, రాజ్యమును తన పిల్లకు అప్పగించి, తీర్థ యాత్రలకు వెళ్ళాడు. తీర్థ యాత్రలలో పుణ్య క్షేత్రములలో,పుణ్య నదులలో ఎన్నెన్నో దానములు, స్నానములు, పూజలు, వ్రతములు చేస్తున్నాడు. ఒక రోజు సహ్యాద్రి పర్వతము మీద ఉండే దత్తాత్రేయస్వామి దగ్గరకు వెళ్ళుతున్నాడు. దత్తాత్రేయస్వామి ప్రహ్లాదుడి హృదయములో ఉండే సందేహము అర్థమయింది. దత్తాత్రేయస్వామి మరొక రూపము దాల్చి, ఒక బురద గుంటలో, తరువాత బయటకు వచ్చి మట్టిలో మరలా బురదలో పొర్లుతున్నాడు. అది ప్రహ్లాదుడు చూసి, ఆ

వ్యక్తి బురదలో, మట్టిలో పొర్లుతున్నా, ఆయన శరీరము బంగారు వర్ణములో ధగ, ధగ మెరిసిపోతోంది. అది చూసి ఈయన ఒక మహాత్ముడు అని గ్రహించాడు. ఆయన దగ్గరకు వెళ్లి నమస్కరించి, మహాత్మా । ఇంత మంచి శరీరమును బురదలో, మట్టిలో పొర్లుతూ ఎందుకు పాడుచేసుకుంటున్నారు? మీ శరీర అంగములు అన్నీ సరిగ్గా ఉన్నాయి కదా, మీరు ఏదో పనిచేసి ధనము సంపాదించుకోవచ్చు కదా । మీరు మీ వయస్సును, సమయమును ఎందుకు వృధా చేస్తున్నారు? అని అడిగాడు. దానికి స్వామి – "నా బంగారు శరీరమును బురదలో, మట్టిలో పాడుచేసుకుంటున్నాను అని అన్నావు. బంగారము కంటె ఎక్కువగా తళతళలాడే పరిశుద్ధమైన ఆత్మను మీరందరూ ఈ అపరిశుద్ధమైన శరీరములలో, ప్రాపంచక విషయములలో ముంచి పాడుచేయుట లేదా? ఈ జన్మ అనే బురద గుంటలో పొర్లి, బయటకు వచ్చి, మరలా మరొక జన్మ, శరీరము అనే బురద గుంటలో పోర్లట లేదా? ఈ జన్మ, శరీరము నుండి ఆత్మ బయట పడాలంటే, ఆధ్యాత్మిక దృష్టి, సాధన పెంచుకోవాలి. నీకు చిన్నప్పటి నుండి ఉండే భక్తి మిగిలి ఉంది. కాని అంతకు మించి ఆధ్యాత్మిక దృష్టి, సాధన పెరగలేదు. శరీరములతో, ప్రాపంచక విషయములతో సంబంధము లేని, జ్ఞాన దీపముగా

ప్రకాశించే ఆత్మ తత్త్వమును తెలుసుకునే ప్రయత్నము, సాధన చేయాలి", అని చెప్పారు. ఇది విన్న ప్రహ్లాదుడు స్వామిని గుర్తించాడు. తరువాత స్వామి తన నిజ స్వరూపము చూపించి, ప్రహ్లాదుడు ఎలా సాధన చేయాలో ఉపదేశము చేశారు.

## 23. ద్రష్టృద్ధృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్

**ద్రష్టృ ధ్ధృశ్య ఉపరక్తం చిత్తం సర్వార్థమ్** - చిత్తం (మనస్సు) అనేది ఒకటి ఉంది. ఆ మనస్సుకి వెనకాలే ద్రష్టృ (చూసేవాడు – ఆత్మ స్వరూపము - జీవాత్మ) అనేవాడు ఉన్నాడు. ఆ మనస్సుకి బయట దృశ్యము (చూడబడే వస్తువులు, విషయములు) అనేవి చాలా ఉన్నాయి. ఈ చిత్తము (మనస్సు) ద్రష్టతోను, దృశ్యముతోను కలిసి ఉంది.

**ఉపరక్తము** = ఎర్ర మందార పువ్వు సన్నిధిలో ఉండుటచే దాని ఎరుపు రంగు కలిగి కనిపించు స్ఫటికపు రాయివలె ఉపాధి సాన్నిధ్యమువలన ఆ ఉపాధి గుణము కలదిగా తోఁచునది. (జీవాత్మ). ఈ చిత్తము (మనస్సు) ద్రష్టతోను (జీవాత్మతో), దృశ్యముతోను (వస్తువులు, విషయములు) కలిసి ఉంది.

**సర్వార్థమ్ -** ఈ చిత్తము అన్ని రకముల విషయములను తెలియచేస్తోంది, అన్ని రకముల

వ్యవహారములను చేస్తోంది, అన్ని ప్రయోజనములను (భోగము – సుఖము మరియు కష్టము, అపవర్గము – మోక్షము) సాధిస్తుంది. ఇలా అన్నీ చేస్తూ మనస్సు ఆత్మ స్వరూపము అని భ్రమలో పడేస్తోంది.

చూసే జీవాత్మకు ("**నేను**") చూచుటకు ఉపయోగపడే సాధనముగా మనస్సు ఉంటుంది. ఈ మనస్సు ఇంద్రియముల ద్వారా ఏ వస్తువు లేదా విషయము మీదకు ప్రసరిస్తుందో, ఆ వస్తువు లేదా విషయము యొక్క జ్ఞానము లోపలి తీసుకువచ్చి ఆ ద్రష్టకు సమర్పిస్తుంది. అప్పుడు ఈ ద్రష్టకు ("**నేను**కు") ఆ వస్తువు లేదా విషయము యొక్క జ్ఞానము కలుగుతుంది. చిత్తము (మనస్సు) ఇటు ద్రష్టతో (జీవాత్మతో), అటు దృశ్యముతోను (వస్తువుతో, విషయముతో) సంబంధము కలిగి ఉంది (ఉపరక్తము). ద్రష్ట యొక్క కొంత శక్తి మనస్సు కలిగి ఉన్నది కాబట్టి, ద్రష్టగా వ్యవహరిస్తూ, తానే ద్రష్ట అనే భ్రమ కలిగిస్తోంది.

ఈ భ్రమ జీవుడి అవిద్యతోనే ప్రారంభమవుతోంది. జీవుడిని ("**నేను**ని") ఎప్పుడైతే అవిద్యతో కప్పేశామో, "**నేను**" అనేది తెలియకుండా సందేహములతో ఎవరు ఏది చెప్పితే అది నమ్మేసి మానవులు అయోమయ పరిస్థితిలో ఉన్నారు. అవిద్య యొక్క బురద తొలగాలంటే, ఆగమ (వేదముల) జ్ఞానముతో మాత్రమే శుభ్రము చేసుకోవాలి.

**కఠోపనిషత్ – 1-3-4 – “ఆత్మేంద్రియ మనోయుక్తం, భోక్తే త్యాహు ర్మనీషిణః”** – శరీరము, ఇంద్రియములు, ఇంద్రియములను నియంత్రించే మనస్సు వీటన్నితో కలిసి ఉన్న ఆత్మ తత్త్వమును భోక్త అని ధీమంతులు (విద్వాంసులు) అంటారు.

**ముండకోపనిషత్ – 2-2-10 – “తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్యదాత్మ విదో విదుః”** – శరీరము, ఇంద్రియములు, మనస్సులతో సంబంధము లేని పరిశుద్ధమైన ఆత్మను జ్యోతులకు జ్యోతి అని ఆత్మ వేత్తలు అంటారు.

## 24. తదసంఖ్యేయవాసనాభిశ్చిత్రమపి పరార్థమ్ సంహత్యకారిత్వాత్

**తద్ అసంఖ్యేయ వాసనాభి శ్చిత్రమపి పరార్థమ్ సంహత్యకారిత్వాత్** -

**తద్ అసంఖ్యేయ వాసనాభి శ్చిత్రమపి -** దృశ్యములను లోపలి తీసుకువచ్చే మనస్సు, జన్మజన్మలలో పోగుచేసుకున్న అసంఖ్యాకమైన సంస్కారములతో ఎన్నెన్నో రూపములతో ఉన్నప్పటికీ,

**పరార్థమ్ సంహత్యకారిత్వాత్** – తనలాంటి ఇతర సాధనములతో (శరీరము, ఇంద్రియములు)

కలుపుకొని పనిచేస్తోంది కాబట్టి, ఇతరుల (జీవుడి) కోసము పనిచేసే స్వభావము కలిగినది.

మనస్సు పనిచేయాలంటే ఆత్మ స్వరూపము ఉండి తీరాలి. ఆత్మ స్వరూపము లేకుండా మనస్సు పనిచేయలేదు. ఎన్నెన్నో జన్మలను నుండి సంపాదించుకున్న సంస్కారములు మనస్సులో పేరుకొని ఉన్నాయి. ఆ సంస్కారముల ప్రభావముతో ఈ మనస్సు ఎన్నెన్నో రూపములను ధరిస్తుంది లేదా క్రియలను (జ్ఞానములను తీసుకువస్తుంది, ఆలోచనలను, భావనలను, వికారములను) చేస్తుంది. మనస్సు ఈ పనులు చేసేటప్పుడు ఇతర జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను, శరీరము యొక్క సహాయము తీసుకుంటుంది. ఎన్నో వస్తువులతో (ఇనుము, సిమ్మెంటు, ఇసుక, ఇటుకలు, రాళ్లు, కలప, చెక్కలు, కరెంటు, బల్బులు, ఫాన్లు, సోఫాలు, మంచములు, కుర్చీలు మొదలైనవి) కలిసి తయారైన భవనము వాటితో ఏ సంబంధము లేని ఆ భవనము యొక్క యజమానికి ఏదో ఒక భోగమును కలుగజేస్తాయి. ఆ వస్తువులు ఆ భోగములను అనుభవించవు. అలాగే త్రిగుణాత్మకమైన మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, శరీరము ఇవన్నీ కలిసి, ఆ శరీరమునకు యజమానైన, ఆ పదార్ధములతో ఏ విధమైన సంబంధము లేని (ప్రకృతి

యొక్క త్రిగుణములు లేని), తమ కంటె విరుద్ధ స్వభావము కల జీవాత్మకు భోగములు (సుఖము, దుఃఖము) లేదా అపవర్గము (మోక్షము) కోసము పనిచేస్తున్నాయి. ఆ భోగములు, అపవర్గము ఆ పదార్ధములు అనుభవించవు. ఆ పరుడు లేదా యజమాని లేదా జీవుడు లేకపోతే ఈ పదార్ధములు ఏ పనీ చేయలేవు. పదార్ధములు జీవుడి కోసము పనిచేస్తాయి. జీవుడు తనంతట తాను ఉంటూ పదార్ధములు చేసే పనిని అనుభవిస్తాడు (స్వార్ధ).

మనస్సు, ఇంద్రియములు లేని బయట ఉండే వస్తువులు, విషయముల కంటె మనస్సు, ఇంద్రియములు ఉన్న శరీరము కొంత గొప్పది. శరీరము కంటె సాత్త్వీక గుణము ఎక్కువగా ఉండే ఇంద్రియములు కొంచము గొప్పవి. ఇంద్రియముల కంటె, ఇంద్రియములను నియంత్రించే మనస్సులో సాత్త్వీక గుణము ఇంకా ఎక్కువగా ఉంటుంది కాబట్టి, ఇంద్రియముల కంటె మనస్సు ఇంకా గొప్పది. వీటన్నిటి కంటె ఆ శరీరము యొక్క యజమాని త్రిగుణములతో ఏ సంబంధము లేని చైతన్య స్వరూపుడైన "**పరః**" (పరమాత్మ – ఆత్మ) అన్ని పదార్ధముల కంటె గొప్పవాడు. ఆ "**పరః**" ను చేరుటకు దారులు, సాధనములు చెప్పగలరు తప్ప, ఆ "**పరః**" ను

ఎవరికి వారు సాధన చేసుకొని అనుభవములోకి తెచ్చుకోవలసినదే.

## 25. విశేషదర్శిన ఆత్మభావభావనావినివృత్తిః

**విశేష దర్శిన ఆత్మ భావభావనా వినివృత్తిః** – పదార్థములు (జీవుడి కోసము పనిచేసేవి), స్వార్థము (తనంతతట తాను ఉండే ఆత్మ) మధ్య ఉండే విశేషమైన బేధమును తెలుసుకోలేక, ఆత్మ భావమును ఎక్కడెక్కడో (ఆత్మతో ఏ సంబంధము లేని మనస్సులో, ఇంద్రియములలో, శరీరములో, భార్యలో, పిల్లలలో, మనవులలో, ఆస్తులలో, సంపదలలో) చూసుకుంటున్నారు.

సామాన్య మానవులు ఆత్మ తత్త్వమును అర్థము చేసుకోలేక ఆత్మతో ఏ సంబంధము లేని మనస్సుని, ఇంద్రియములను, శరీరమును, భార్యను, పిల్లలను, మనవులను, ఇల్లును, ధనమును, సంపదలను) అన్నింటినీ ఆత్మతో కలిపే సి, అవే **"నేను"** (ఆత్మ) లేదా **"నాది"** (ఆత్మది) అని అనుకుంటూ భ్రమ పడుతున్నారు. ఆత్మతో ఏ సంబంధము లేని మనస్సుకు, ఇంద్రియములకు, శరీరమునకు, భార్యకు, పిల్లకు, మనవులకు, ధనమునకు, సంపదలకు ఏ కష్టము లేదా నష్టము కలిగినా, **"నాకు"** (ఆత్మకు) కష్టము లేదా నష్టము కలిగిందని భ్రమ పడి బాధ

పడుతూ ఉంటారు. ఆత్మ స్వరూపమును, ఆత్మ స్వరూపము కాని తన శరీరములో, శరీరమునకు సంబంధించిన భార్యలో, పిల్లలలో, ధనములో, పదవులలో, విద్యలో, అహంకారములో మరియు ప్రాపించక విషయముల అన్నిటిలో "**నేను**", "**నాది**" గా భావిస్తూ, భావిస్తూ వేరొక విధముగా పెంచుకుంటూ ఇబ్బందులు, బాధలు పడుతున్నారు.

ఆత్మ స్వరూపమునకు ఏ విధమైన సంబంధము లేని, మనస్సు నుండి బయట విషయములను వదిలేసి, మనస్సు లోపల, వెనుక ఉండే ఆత్మ తత్త్వము గురించి విశేష దర్శనము (జ్ఞానము) సాధించుకుంటే ప్రాపించక విషయముల మీద ఉన్న ఆత్మ భావము ("**నేను**", "**నాది**") తొలగిపోతుంది. ఆ విశేష దర్శనము అష్టాంగ యోగ సాధనములను శ్రద్ధగా చేసుకోవాలి. అప్పుడు "**నేను**" అనే పదమునకు సరైన అర్థము తెలుస్తుంది.

**<u>ఉదాహరణ:</u>**

ఒక పల్లెటూరులో ఎండాకాలము తరువాత రెండు రోజులు జల్లులు పడ్డాయి. ఒక వ్యవసాయదారుడు, అతని మనవడు పొలము వెళ్ళారు. అంతవరకు బీడు కట్టి ఉన్న పొలము, చిన్న, చిన్న మొలకలతో పచ్చగా కనిపించింది. అప్పుడు

మనవడు తాతగారితో, ఇంతవరకు బీడు కట్టి ఉన్న మన పొలములో, మనము విత్తనములు వేయకుండానే, ఈ మొలకలు ఎలా వచ్చాయి అని అడిగాడు. దానికి తాతగారు, భూమిలో గడ్డి, కలుపు మొక్కల విత్తనములు చాలా బలముగా ఉంటాయి. ఆ విత్తనములు ధాన్యపు విత్తనముల వలె ఎండిపోవు, కుళ్లిపోవు. కొంచము జల్లులు పడగానే ఆ గడ్డి విత్తనములు, కలుపు మొక్కల విత్తనములు వెంటనే మొలకలు ఎత్తుతాయి. వాటికి ఎక్కువ వర్షము నీళ్ళు అక్కర్లేదు అని చెప్పాడు.

అదే విధముగా ఎప్పుడో, పూర్వ జన్మలలో విన్న లేదా చేసిన చిన్న, చిన్న మంచి విషయములు, పుణ్య కర్మలు మనస్సులో సంస్కారముల రూపములలో అంతర్లీనముగా దాగి ఉంటాయి. సరైన సందర్భములలో కాని, గురువుల ఉపదేశములతో కాని ఆ సంస్కారములు మళ్ళీ మొలకెత్తి వాటి ప్రభావములతో జీవుడిని తత్త్వ జ్ఞాన సాధన దిశగా ప్రేరేపిస్తాయి, ప్రోత్సహిస్తాయి.

## 26. తదా వివేకనిమ్నమ్ కైవల్యప్రాగ్భారమ్ చిత్తమ్

**తదా వివేకనిమ్నమ్ కైవల్య ప్రాగ్భారమ్ చిత్తమ్** - ఆ విశేష దర్శనము (ఆత్మ చైతన్య స్వరూపము వేరు, త్రిగుణములకు సంబంధించిన

పదార్ధములు, వస్తువులు వేరు) ప్రారంభమైనప్పుడు (మనస్సు పరిశుద్ధమైనప్పుడు), మనస్సు వివేకము అనే పల్లము వైపు పారుతూ, ప్రయాణిస్తూ కైవల్యమును అందుకోవటానికి సంసిద్ధమవుతుంది.

ఒకవేళ వివేక దర్శనము లేకపోయినట్లయితే, మనస్సు అవిద్య, క్లేశములు (అజ్ఞానము) అనే పల్లము వైపు పారుతూ, ప్రయాణిస్తూ సంసారము అనే అఖాతములో పడుతుంది.

**<u>ధర్మము:</u>**

**మహాభారతము - "ధారణాత్ ధర్మ ఇత్యాః ధర్మో ధారయతి ప్రజాః । య స్య ధారణసంయుక్తః స ధర్మ ఇతి నిశ్చయః"** - ధర్మము మానవులను/సమాజమును ఒకటిగా నిలబెట్టును. ధర్మము మానవుడి జన్మ జన్మలను కూడా నిలబెట్టుతుంది. మానవుడి అస్తిత్వమును (ఉనికిని) నిలబెట్టును. మానవుడిని ఉన్నత స్థాయికి తీసుకువెళ్ళుతుంది.

## 27. తచ్ఛిద్రేషు ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః

**తత్ ఛిద్రేషు ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః** – ధ్యానము పై స్థాయికి చేరి, సమాధి స్థితి కలిగిన తరువాత, ఏదో ఒక కారణముతో ఆ సమాధి

స్థితికి భంగము (రంధ్రము, Gap) కలిగి, వారిలో ఉండే సంస్కారముల ప్రభావముతో వేరే రకమైన ఆలోచనలు, క్రియలు జరుగుతాయి. ఆ సాధకులు ఈ భంగమును గమనించి, ఆ విధమైన సంస్కారముల ప్రభావము కలగకుండా ఉండేలా ప్రయత్నించి, సాధనలో ముందుకు సాగిస్తారు.

కొంతమంది మహానుభావుల తపస్సు లేదా సమాధి స్థితి కొంత కాలము భంగపడినా – ఆత్మ భావన స్థితి నుండి దేహ భావన స్థితికి వచ్చి లేదా దేహమును పోషించుటకు, రక్షణకు (విశ్వామిత్ర మహర్షి, కండు మహర్షి, దుర్వాస మహర్షి మొదలైన వారు), తరువాత మరలా వారి సాధన మొదలుపెట్టి కృతకృత్యులు అయ్యారు. కాని సాధారణ మానవులు ఏ చిన్న స్థాయి సాధన, ప్రయత్నము మొదలుపెట్టినా, వారిలో ఉండే సంస్కారముల ప్రభావముతో ఆ సాధనకు, ప్రయత్నముకు భంగము కలిగి ఆ సాధన, ప్రయత్నము ఆపేసి దిగజారిపోతారు. మనము ఆ సంస్కారముల ప్రభావము కలగకుండా ఉండేలా చాలా నిగ్రహము పాటించి, ఆ సంస్కార ప్రభావములకు లోబడకుండా మన సాధన, ప్రయత్నములను కొనసాగించాలి. మన మనస్సు ఒకసారి క్రిందకు జారిపోయే పరిస్థితి ఏర్పడితే, దానిని వెనక్కు మరలించి సరైన దారిలో పెట్టటము చాలా

కష్టమైన పని. కాబట్టి మనము మన సంస్కారములను తగ్గించుకునే ప్రయత్నము చేయాలి.

**ఛాందోగ్యోపనిషత్ – "అరణ్యం ఇయద్ ఇతి పదం తతో న పునరేయాత్"** – ఒక వేళ వైరాగ్యము కలిగి సాధన చేసుకోవాలి అనే కోరిక కలిగితే, వెంటనే ఆ సాధన చేసుకుందుకు తగిన ప్రదేశమునకు (గురువు, ఏకాంత ప్రదేశము, అరణ్యము) వెళ్లి, సాధన చేసుకోవాలి. సాధన స్థాయి నుండి దిగజారకూడదు, మళ్ళీ వెనక్కు మాత్రము రాకూడదు. సాధన భంగము, అంతరాయము కలిగితే వేరే ఆలోచనలు కలుగుతాయి. ఆ ఆలోచనలకు కారణము మనస్సులో పేరుకున్న సంస్కారములు. సాధనకు భంగము, అంతరాయములు కలిగించే సంస్కారముల ప్రభావములను తగ్గించుకోవాలి.

## 28. హానమేషాం క్లేశవదుక్తమ్

**హానమేషాం క్లేశవద్ ఉక్తమ్** – మనలోని సంస్కారములు ఎన్ని జన్మల నుండి కలిగినా సరే, ఎన్నెన్ని ఉన్నా సరే, ఎంత బలముగా ఉన్నా సరే వీటి ప్రభావములను తగ్గించుకొనుట సాధ్యము. ఎలాగైతే ప్రతిప్రసవము, ధ్యానము ద్వారా అవిద్య, అస్మిత - అహంకారము, రాగము, ద్వేషము, అభినివేశము – నేను ఉండాలి అనే భావన, అనే క్లేశముల ప్రభావములను

తగ్గించుకోగలమో (రెండవ పాదము 10, 11 వ సూత్రములలో - **10. తే ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః, 11. ధ్యానహేయాస్తద్వృత్తయః**), అదే విధముగా క్లేశ సంస్కారముల ప్రభావములను తగ్గించుకోవచ్చును.

ప్రతి ప్రసవము, ధ్యానము సాధనలో ఎంతో పై స్థితి. కాని సామాన్య సాధకులకు ఈ సంస్కార ప్రభావములను తగ్గించుకుందుకు (రెండవ పాదము 26 వ సూత్రములో **26. వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః**) చెప్పిన విధముగా "**నేను**" వేరు, ప్రపంచములోని వస్తువులు (శరీరము, ఇంద్రియములు, మనస్సు కూడా) వేరు అనే వస్తు తత్త్వము, ఆత్మ తత్త్వము అనే వివేక ఖ్యాతి మనస్సులో స్థిరముగా బలపడితే, సంస్కారముల ప్రభావము తగ్గుతాయి.

క్లేశములలో ముఖ్యమైన అవిద్య – "**నేను**" కాని శరీరమును "**నేను**" అనే భ్రమపడుట. మిగిలిన నాలుగు క్లేశము (అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము) ఈ అవిద్య అనే క్లేశము మూలముగానే కలుగుతాయి. సంస్కారములు కూడా ఈ క్లేశముల ద్వారానే పుట్టుకొస్తాయి. కాబట్టి అవిద్యను పోగొట్టుకుంటే, ఈ క్లేశములు, సంస్కారములు తొలగిపోతాయి. అవిద్య వివేకము ద్వారా తొలగిపోతుంది. అవిద్య – "**నేను**" ఎవరు?, "**నాకు**", ఈ

శరీరమునకు, మనస్సుకి సంబంధము ఏమిటి? "**నేను**" కర్తను (కర్మలకు కారణము గుణములు, ఆత్మ కాదు). "**నేను**" భోక్తను (నేను భోగములు అనుభవిస్తున్నాను – కర్మ గుణములు చేస్తే, వాటి బాధ్యత, ఫలితములు ఆత్మ ఎందుకు అనుభవించాలి?) అనే భ్రమ. చైతన్య స్వరూపమైన ఆత్మ స్వరూపము కేవలము ఉదాసీనముగా, ఏ రకముల పదార్ధములతో సంబంధము లేకుండా, తనంతట తాను స్వచ్ఛముగా ప్రకాశ రూపముగా ఉంది. ఆత్మ యొక్క చైతన్య శక్తి ప్రతిబింబము మనస్సులో ఏర్పడుతోంది. ఎలాగైతే సూర్య కిరణములు నీటిలో పడినప్పుడు నీళ్ళు కొంచము వేడెక్కుతాయో, అదే విధముగా మనస్సులో పడిన ఆత్మ బింబము యొక్క ప్రతిబింబమును మనస్సు గ్రహించుట వలన, ఆ ప్రతిబింబము ప్రభావముతో మనస్సులో కొంత చైతన్య శక్తి కలిగి, మనస్సు ఆత్మగా వ్యవహరించినట్లుగా తోస్తోంది. అసలు బింబము మీద దృష్టి తొలగిపోయి, ప్రతిబింబము మీద దృష్టి పెరిగి మనస్సు చేసే ప్రతి క్రియకు ఆత్మ బాధ్యత వహిస్తూ ("**నేను**" కర్తను అనే భ్రమ కలిగి), ఆత్మ ఆ కర్మ ఫలితము అనుభవిస్తునట్లుగా ("**నేను**" భోక్తను అనే భ్రమ) భ్రమ కలుగుతోంది. ఎలాగైతే సూర్యుడికి, నీళ్ళకు ఏ విధమైన సంబంధము లేదో, అదే విధముగా వాస్తవానికి ఆత్మకు,

మనస్సుకు, మనస్సు చేసే ఆలోచనలకు, మనస్సు ద్వారా జరిగే క్రియలకు లేదా కర్మలకు ఆ కర్మ ఫలితములకు  ఏ విధమైన సంబంధము లేదు. వాస్తవానికి మనస్సు అన్ని క్రియలను, కర్మలను చేస్తోంది. కాబట్టి ఆ కర్మల ఫలితములు మనస్సు అనుభవించాలి. ఆత్మకు ఏ విధమైన సంబంధము లేదు. ఆత్మ తన స్వస్వరూపము, పదార్ధ తత్త్వము అనే వివేకము నిరంతరము అనుభవములోకి వచ్చేంతవరకు ఆత్మ అవిద్యచే ఆవరించబడి ఉన్నట్లే.

ఈ మనస్సు చేసే ఆలోచనలను, క్రియలను ఎలా అరికట్టాలి? మనస్సు ప్రకృతి యొక్క పరిణామమే. మనస్సు, ప్రకృతి యొక్క స్వభావము – 1. అనులోమ (అనుకూల) పరిణామములను – మనస్సు నిరంతరము ఏదో ఒక ఆలోచనలను లేదా క్రియలను చేస్తూ ఉంటుంది. 2. ప్రతిలోమ (ప్రతికూల) పరిణామములను – మనస్సు అనులోమ పరిణామములకు వ్యతిరేకముగా – ఆలోచనలను, క్రియలను అడ్డుకుంటుంది. అనులోమ పరిణామములను ఆపుకోవాలి అనే ధృఢమైన సంకల్పముతో, ప్రతిలోమ పరిణామము పనిచేసి మనస్సు యొక్క ఆలోచనలను, క్రియలను ఆపుకోవచ్చు. దుఃఖమైన ఈ సంసారిక ఆలోచనలు,

క్రియలు నాకు వద్దు అనే దృఢమైన ఆలోచన (వివేకము + వైరాగ్యము) కలిగినప్పుడు ప్రతిలోమ పరిణామము మనస్సులో పనిచేస్తుంది. మనస్సు పూర్తిగా తన పూర్తి అయిపోగానే, మనస్సు తనకు మూలమైన ప్రకృతిలో లీనమైపోతుంది.

**<u>ఉదాహరణ:</u>**

ఒక పల్లెటూరులో ఒక చిన్న గుట్ట ఉంది. ఆ గుట్ట చుట్టు ప్రక్కల పచ్చని చెట్లు, వాతావరణము చాలా బాగుంటుంది. ఆ మంచి వాతావరణములో, మంచి ఆలోచనలు, అభిప్రాయములు కలగాలని, కొంతమంది పెద్దవాళ్లు, ఆ గుట్ట మీద ఒక పెద్ద అమ్మవారి మహిషాసుర మర్దిని విగ్రహమును స్థాపించారు. ఆ చుట్టు ప్రక్కల గ్రామముల నుండి చాలా మంది వచ్చి, అమ్మ వారికి నమస్కరించి, కోరికలు కోరుకొని వెళ్ళుతూ ఉండేవారు. అది అందమైన ప్రదేశము కాబట్టి, కొంతమంది వినోదము కోసము కూడా వెళ్ళుతూ, ఫొటోలు (Selfee) కూడా తీసుకుంటూ ఉండేవారు. ఆ ఊరులో ఉండే కొంత మంది మహానుభావులు, అమ్మవారి రూప వర్ణన, నా కష్టాలను తీర్చు, నా కోరికలు తీర్చు, నన్ను నీలో కలిపేసుకో అనే అర్థములు వచ్చే మంచి శ్లోకములు, స్తోత్రములు రాళ్ల మీద చెక్కించి అమ్మవారి విగ్రహము చుట్టూ అమర్చారు. అక్కడికి వచ్చే భక్తులు ఆ శ్లోకములను, స్తోత్రములను పఠిస్తూ

అమ్మవారికి నమస్కరించి వెళ్ళుతూ ఉండేవారు. కొన్నాళ్ళకి అమ్మవారికి ఒక ఆలోచన కలిగింది. వీళ్ళందరూ నా మీద నమ్మకముతో, భక్తితో వీళ్ళందరూ నాలో కలిసిపోవాలని కోరికతో వచ్చి నా మీద శ్లోకములు, స్తోత్రములు పఠిస్తున్నారు. వీళ్ళను అనుగ్రహించాలి అని అనుకుంది. అమ్మవారి ఒక పండగ రోజున చాలా మంది జనము వచ్చారు. అప్పుడు మహిషాసుర మర్ధిని అమ్మవారి విగ్రహము నుండి మంచి మధురమైన, గంభీరమైన కంఠతో “భక్తులారా మీరందరూ నాలో కలిసిపోవాలని నన్ను ప్రార్ధిస్తున్నారు. నేను మిమ్మల్ని అనుగ్రహించాలని అనుకుంటున్నాను. మీలో ఎవరైతే నాలో కలిసిపోవాలని అనుకుంటున్నారో, వాళ్ళు ఒక్క అడుగు ముందుకు వేయండి. వాళ్లను నేను, నాలో కలిపేసుకుంటాను” అని ప్రకటించింది. ఇది విన్న వెంటనే, ఎవ్వరూ ఒక్క అడుగు ముందుకు వేయలేదు సరి కదా, అందరూ భయపడి పొలోమని వెనక్కు తిరిగి పరిగెత్తుకుంటూ పారిపోతున్నారు. అంతలో మీడియా వాళ్ళు వచ్చి ఏమి జరిగింది అని అడుగుతున్నారు. కొంతమంది మేము ఆఫీసుకు వెళ్ళాలి, మేము పరీక్ష వ్రాయాలి, మా రైలు లేదా ఫ్లైట్ టైము అయిపోతోంది వెళ్ళాలి, మేము ఉద్యోగమూ ఇంటర్వ్యూకి వెళ్ళాలి, మేము వంట చేసుకోవాలి, మేము అమ్మవారిలో కలిసిపోతే మా పనులు ఆగిపోతాయి అని చెప్పుతూ

పరిగెత్తుతున్నారు. ఆ సమయములో అక్కడ ఉన్న పూజారి అమ్మవారి ప్రకటన వినలేదు, పారిపోవట లేదు. ఆ మీడియా వాళ్ళు ఆ పూజారిని కూడా అడిగారు. దానికి పూజారి నేను అమ్మవారికి నైవేద్యము తీసుకురావటానికి లోపలికి వెళ్లాను. ఏమి జరిగిందో నాకు తెలియదు అని అన్నాడు. అప్పుడు మీడియా వాళ్ళు ఏమి జరిగిందో చెప్పమని అమ్మవారినే అడిగారు. దానికి అమ్మవారు ప్రజలు అందరూ భక్తితో నా మీద శ్లోకములు, స్తోత్రములు పఠిస్తూ వాళ్ళ కోరికలు కోరుకుంటున్నారు. చాలా మంది చాలా కోరికలు నేను తీరుస్తున్నాను. కొంతమంది వాళ్లను నాలో కలుపుకోమని కూడా ప్రార్థిస్తున్నారు. అందుచేత వాళ్లను నాలో కలుపుకోవాలని ఒక ప్రకటన చేశాను. అందరికీ వాళ్ళ, వాళ్ళ కష్టములు నుండి విముక్తి కలగాలని, వాళ్ళు సుఖముగా ఉండాలని ఉంది. నాలో కలిసిపోతే వాళ్లకు ప్రాపించక సమస్యల నుండి శాశ్వత పరిష్కారము కలుగుతుంది అని కూడా తెలుసు. వాటితోపాటు వాళ్లకు ఎన్నెన్నో ప్రాపించక కోరికలు ఉన్నాయి, ఆ కోరికలు తీర్చుకోవాలని వ్యామోహము కూడా ఉంది. వాళ్ళకు వాళ్ళ ప్రాపించక సమస్యలకు పరిష్కారములు కలగాలని కూడా ఉంది. వాళ్ళ మనస్సు మొత్తము వాళ్ళ ప్రాపించక కోరికలతో నిండిపోయి ఉంది. వాళ్లకు ప్రాపించక వ్యామోహము

ఇంకా తగ్గలేదు. అందుచేత వాళ్ళు నిజముగా నాలో కలవటానికి సిద్ధముగా లేరు. (భక్తులు భగవంతుడికి పూజ చేసి, నైవేద్యము సమర్పిస్తారు. ఒకవేళ భగవంతుడు ఆ నైవేద్యమును నిజముగా స్వీకరిస్తే (తింటే), తరువాత ఆ భక్తులు ఆ నైవేద్యము కూడా సమర్పించరు).

**భగవద్గీత – 2-70 – "ఆపూర్యమాణ మచల ప్రతిష్టం సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ । తద్వత్కామా'యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న కామకామీ"** – నదులు నిరంతరమూ సముద్రమును చేరినా సముద్రము యొక్క మట్టము పెరగకుండా సుస్థిరముగా ఉంటుందో, అదే విధముగా మానవులలో కోరికలు ప్రవాహము నిరంతరము చేరుతున్నా, ఏ మానవుడైతే తనంతట తాను ఏమీ కోరుకోకుండా తాను పొందిన ఫలితములతో తృప్తిగా, కలత చెందకుండా, సుస్థిరముగా ఉంటాడో, ఆ మానవుడు మాత్రమే పరిపూర్ణమైన శాంతిని అనుభవిస్తాడు. తనంతట తాను కోరికలు కోరుకునేవాడు, ఎప్పటికీ శాంతిని అనుభవించలేడు.

**భగవద్గీత – 2-70 – "విహాయ కామాన్ య స్సర్వాన్ పుమాం శ్చరతి । నిస్పృహః నిర్మమో నిరహంకారః స శాన్తి మదిగచ్ఛతి" –** ఇంద్రియములను నిగ్రహించుకొని, అన్ని కోరికలను

విడిచిపెట్టి, ఏ విధమైన ఆపేక్ష లేకుండా, మమకారము మరియు అహంకారము లేకుండా ఉండువాడు మాత్రమే నిజమైన శాంతిని పొందుతాడు.

## 29. ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతేర్ధర్మమేఘస్సమాధిః

**ప్రసంఖ్యానేపి అప్య కుసీదస్య సర్వథా వివేకఖ్యాతేః ధర్మమేఘః స్సమాధిః** – **ప్రసంఖ్యానము** = ప్రకృష్టమైన జ్ఞానము, తత్త్వ జ్ఞానము. తత్త్వ జ్ఞానము (మోక్షము) మీద కూడా ఫలాపేక్ష లేనివారికి, మనస్సులో ఖాళీ ఏర్పడుతుంది. ఆ ఖాళీలో మనస్సులో వివేక ఖ్యాతి నిరంతరము నిండుకొని ఉన్నవారికి అమృత ధారను కురిపించే ధర్మ మేఘము అనే సమాధి స్థితి ఏర్పడుతుంది.

**భగవద్గీత – 6-26 – “యతో యతో నిశ్చలతి మన శ్చంచల మస్థిరమ్ । తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్”** – ఇంద్రియములను, చంచలమైన మనస్సు స్వాభావిక ప్రవృత్తితో ప్రాపించక విషయముల వైపు పారిపోతూ, పారిపోతూ ఉండగా, ఆ మనస్సుని ప్రేమతో లేదా బలవంతముగా మళ్ళీ, మళ్ళీ వెనక్కు లాకొచ్చి, ఆత్మ స్వరూపము మీద నిలబెట్టుకోవాలి, కేంద్రీకరించాలి (నిధిధ్యాసనము, ప్రసంఖ్యానము). దీనిని ప్రత్యయ ఆవృత్తి, అభ్యాసము,

ధ్యానము, ప్రసంఖ్యానము అని అంటారు. అప్పుడు వివేక ఖ్యాతి కుదురుకొని, బలము చేకూరుతుంది.

క్లేశములు, సంస్కారములు క్రమక్రమముగా తగ్గి, ఏ కోరికలు లేకుండా స్థిరముగా ఉన్నట్లయితే, మనస్సులో నిరంతరము వివేక ఖ్యాతి (ఆత్మ స్వరూపమునకు, మనస్సుకు, వస్తువులకు మధ్య ఉండే బేధము) తప్ప మరొక ఆలోచన లేని పరిస్థితి కలిగినప్పుడు అమృత ధారను కురిపించే ధర్మ మేఘము అనే సమాధి ఏర్పడుతుంది.

1. ప్రాపించక కోరికలు (రాజస, తామస గుణముల కోరికలు, సంసారిక బంధము కలిగించే కోరికలు), 2. మోక్షము కావాలనే కోరిక (సాత్త్విక గుణము యొక్క కోరిక, సంసార బంధమును తొలగించే కోరిక) ఈ రెండూ కోరికలే. వీటిలో ఏ కోరిక ఉన్నా అది కోరికే కాబట్టి, ఈ కోరికలు సాధనకు తూట్లు (రంధ్రము) పొడుస్తూ, వేరే కొత్త ఆలోచనలను కలిగించి, మనస్సును మరింత కలుషితము చేస్తుంది.

తత్త్వ జ్ఞానము, ఆ జ్ఞానము యొక్క ఫలితము (మోక్షము) కావాలి అనే కోరికలు కూడా లేకుండా, కేవలము వివేక ఖ్యాతి మాత్రమే మనస్సులో స్థిరముగా ఉన్నప్పుడు, అమృత ధారను కురిపించే ధర్మ మేఘము అనే సమాధి స్థితి ఏర్పడుతుంది.

## వైరాగ్యము:

వైరాగ్యము కోపముతో, ద్వేషముతో, ఆవేశముతో, భావోద్వేగములతో తాత్కాలిక పరిస్థితులలో నిర్వేదముతో పుట్టుకురాదు. వీటితో కలిగే ఉద్వేగము ఎన్నాళ్ళో ఉండదు. వైరాగ్యము ఒక అనుకూలమైన భావన. సంసారిక విషయముల మీద పూర్తి అవగాహనతో, సరైన విశ్లేషణ చేసినప్పుడు కలుగుతుంది. సరైన వైరాగ్యము కలిగినప్పుడు మాత్రమే సన్యాసము తీసుకోవాలి.

**గౌడపాదాచార్యుల కారికలు – "దుఃఖమ్ సర్వ అనుస్మృత్య కామ భోగాన్ నివర్తయేత్ । అజం సర్వ అనుస్మృత్య జాతం నైవతు పశ్యతి"** – నాకు కేవలము సుఖము కావాలా లేదా సుఖ దుఃఖముల మిశ్రమము అయినా పర్వాలేదు అని ఆలోచించి నిర్ణయము తీసుకోవాలి. తరువాత సంసారిక విషయములు, ప్రాపించక వస్తువులు, వ్యక్తులు నాకు దుఃఖము కలిగిస్తున్నాయా లేదా సుఖము కలిగిస్తున్నాయా అని ప్రశ్న వేసుకోవాలి. వీటి ద్వారా లేశ మాత్రమైన దుఃఖము కలిగినా సరే, అవి నాకు వద్దు అని నిర్ణయించుకోవాలి, కాని వాటి మీద ఏ మాత్రము ద్వేషము ఉండకూడదు. కోరికలు కలిగి, వాటి కోసము ప్రయత్నించే అలవాటు నుండి బయటకు రావాలి. నీకు ఏమి కావాలో అనే దాని మీద ఒక స్థిరమైన అభిప్రాయము కలిగి ఉండాలి. వస్తువులు,

విషయములు, వ్యక్తులు ద్వారా కలిగే తాత్కాలికమైన దుఃఖముతో కూడని సుఖము నాకు వద్దు. ఏ వస్తువు, విషయము, వ్యక్తి ద్వారా కాకుండా, ఏ కోరిక లేని శాశ్వతమైన సుఖము (**అజం సుఖమ్**) కావాలి అన్ని నిర్ణయించుకున్న తరువాత మరొక వస్తువుని, విషయమును, వ్యక్తిని పట్టించుకోకూడదు, కనీసము క్రీగంటితో కూడా చూడవద్దు. దీనిని నిజమైన శాశ్వతమైన వైరాగ్యము అంటారు.

**గౌడపాదాచార్యుల కారికలు** – "**వీతరాగ భయ క్రోధైః మునిభిర్ వేద పారగైః నిర్వికల్పో యహ్యం దృష్టః ప్రపంచోప సమో ద్వవః**" – ఏ వస్తువు మీద రాగము లేదు, భయము లేదు, కోపము లేదు. కేవలము ఆత్మ తత్త్వము సాధన మీదే దృష్టి కేంద్రీకరించి, మౌనముగా సాధన చేసుకుంటూ, ఈ జ్ఞాన సాధనను మళ్ళీ, మళ్ళీ వేద వాక్యములలో ఉండే ఆత్మ తత్త్వమును మాత్రమే ఆవృత్తి, అనుసంధానము చేసుకుంటూ ఉంటే, సృష్టిలో (ప్రపంచములో) భాగము కాని, వికల్పములు లేని అద్వితీయమైన ఆత్మ తత్త్వము తెలుస్తుంది. ఇలా కాకుండా వేరే విధముగా ప్రయత్నము చేస్తే ఏమీ తెలియదు. దీనికి మరో రకమైన ప్రయత్నము ఏమీ లేదు.

## 30. తతః క్లేశకర్మనివృత్తిః

**తతః క్లేశ కర్మ నివృత్తిః** – వైరాగ్యము, వివేక ఖ్యాతిని మనస్సులో స్థిరముగా, బలముగా ఏర్పడి, ధర్మ మేఘ సమాధి కలిగిన తరువాత పంచ క్లేశములు (అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము) మరియు కర్మలు తొలగిపోతాయి. క్లేశముల ద్వారా ఏ కష్టము ఉండదు, క్లేశముల ప్రభావముతో చేసిన కర్మల ఫలితములు కలగవు.

2 వ పాదములోని 3 వ సూత్రము - **3. అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః పంచక్లేశాః** – పంచ క్లేశములు - **1. అవిద్య** – భ్రమ, విపర్యయ (వ్యతిరేకమైన, విరుద్ధమైన) జ్ఞానము – ఉన్నది లేనట్లుగా, లేనిది ఉన్నట్లుగా భావించుట, **2. అస్మిత** – అహంకారము – "**నేను**" లేదా "**నాది**" కాని శరీరమును, మనస్సును "**నేను**", "**నాది**" అనే భావన, **3. రాగము** - ప్రీతి, **4. ద్వేషము** – శత్రుత్వము, పగ, **5. అభినివేశము** – నేను ఉండాలి, నేను బాగుండాలి అనే తీవ్రమైన అభిలాష.

2 వ పాదములోని 4 వ సూత్రము - **4. అవిద్యా క్షేత్రముత్తరేషాం ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణామ్**

- ఈ ఐదు క్లేశములలో అవిద్య ప్రధానమైన క్లేశము. మిగిలిన నాలుగు క్లేశములకు (అస్మిత, రాగము,

ద్వేషము, అభినివేశములకు) అవిద్య ప్రధానమైన జన్మ భూమి లాంటి క్లేశము.

అవిద్య లేకపోతే మిగిలిన నాలుగు క్లేశములు ఉండవు. అవిద్య ఉంటే మిగిలిన నాలుగు క్లేశములు తప్పకుండా ఉంటాయి. అవిద్య తమము (భ్రమ, అజ్ఞానము) కాబట్టి, తత్త్వ జ్ఞానము (వివేక ఖ్యాతి) కలిగినప్పుడు తప్పకుండా అవిద్య తొలగిపోతుంది. మరొక ప్రాపించక విషయములు ఏవీ లేకుండా, వివేక ఖ్యాతి మాత్రమే మనస్సులో బలముగా నిండుకొని ఉన్నప్పుడు, అవిద్య తప్పకుండా తొలగిపోతుంది. అవిద్య తొలగిపోయినప్పుడు, అవిద్య జన్మ భూమిగా ఉండే మిగిలిన నాలుగు క్లేశములు (అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము) కూడా తొలగిపోతాయి.

2 వ పాదములోని 13 వ సూత్రము - **13. సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః** – ముఖ్య మూల క్లేశమైన అవిద్య ఉన్నట్లయితే, ఆ అవిద్య కారణముగా కర్మ ఫలితములుగా జనం, ఆయుస్సు, భోగము (సుఖము, దుఃఖము) కలుగుతాయి.

2 వ పాదములోని 12 వ సూత్రము - **12. క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్టజన్మవేదనీయాః** – ఈ పంచ క్లేశములలో ప్రధాన క్లేశమైన అవిద్య వలన కర్మలు (పుణ్యములు, పాపములు) చేయబడతాయి. ఆ

కర్మల ఫలితములుగా ఈ జన్మలో కొన్ని ఫలితములు కలుగుతాయి. గత జన్మలలో కొన్ని ఫలితములు కలిగి ఉంటాయి. కలగబోయే జన్మలలో కొన్ని ఫలితములు కలుగుతాయి, కొన్ని ఫలితములు కలిగేందుకు సిద్ధముగా ఉంటాయి.

అవిద్య క్లేశములకు, కర్మలకు, జన్మలకు, ఆయుస్సుకు, భోగములకు (సుఖము, కష్టము) పరమ మూల కారణము. ప్రకాశవంతమైన తత్త్వ జ్ఞానము (వివేక ఖ్యాతి) కలిగి చీకటి అనే అవిద్య తొలగిపోయే, క్లేశములు, కర్మలు, జన్మలు, ఆయుస్సు, భోగములు అన్నీ తొలగిపోతాయి. అప్పుడు కైవల్యము పొందుటకు అర్హత ఏర్పడుతుంది. చీకటి అనే అవిద్య తొలగాలంటే, ప్రకాశము అనే తత్త్వ జ్ఞానము (వివేక ఖ్యాతి) తప్ప మరొక మార్గము లేదు.

**న్యాయ దర్శనము – గౌతమ మహర్షి – "దుఃఖ జన్మ ప్రవృత్తి దోష మిథ్యా జ్ఞానానామ్ ఉత్తరోత్తరాపాయే సదనంతరాపాయాత్ అపవర్గః"** – మానవులు దుఃఖ పడుతున్నాము అని అనుకుంటారు. ఆ దుఃఖములకు కారణము వారు ఎత్తిన జన్మ. వారి జన్మకు కారణము వారు చేసుకున్న కర్మ ఫలితములు (పుణ్యములు, పాపములు). వారు కర్మలు (పుణ్యములు, పాపములు) చేయుటకు కారణము వారికి ఉన్న రాగము, ద్వేషము, మోహము (క్లేశములు). రాగము,

ద్వేషము, మోహములకు కారణము వారికి ఉన్న మిథ్యా జ్ఞానము లేదా భ్రమ లేదా అవిద్య. ఈ మిథ్యా జ్ఞానము లేదా అవిద్య పోవాలంటే తత్త్వ జ్ఞానమును సాధించుకోవాలి. తత్త్వ జ్ఞానము మిథ్యా జ్ఞానమును లేదా అవిద్యను (భ్రమలను) తొలగిస్తుంది. అవిద్య తొలగితే రాగము, ద్వేషము, మోహము అనే దోషములు తొలగిపోతాయి. రాగము, ద్వేషము, మోహము అనే దోషములు తొలగితే, జీవుడు కర్మలు చేయడు. కర్మలు లేకపోతే జీవుడికి జన్మలు ఉండవు. జన్మలు లేకపోతే జీవుడికి దుఃఖము కలిగే అవకాశమే ఉండదు.

**న్యాయ దర్శనము – గౌతమ మహర్షి – "వీతరాగ జన్మా దర్శనాత్"** – జీవుడికి దుఃఖములకు కారణమైన ఎన్నెన్నో జన్మలు కలుగుతున్నాయి. ఆ జనములు కలగటానికి కారణము ఆ జీవుడు చేసుకున్న కర్మలు. ఆ కర్మలు ఏదో ఒక కోరికతో (రాగముతో) చేస్తున్నారు. ఈ జన్మ పరంపర ఆగాలి అని అనుకుంటే, రాగము, ద్వేషము (కోరికలు) కలగకుండా చూసుకోవాలి. కోరికలు లేకపోతే కర్మలు చేయడు, జన్మలు కలగవు.

**బ్రహ్మ సూత్రములు – చతుర్ధ అధ్యాయము – ప్రధమ పాదము - 9. తదధిగమాధికరణము - 13. "తదధిగమ ఉత్తర పూర్వాఘయోర శ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్", "14. ఇతరస్యాప్యేవ మసంశ్లేషః**

**పాతేతు**"– ఆత్మ తత్త్వమును పూర్తిగా అర్థము చేసుకున్నట్లయితే, అంతవరకు చేసుకున్న కర్మలు (పుణ్యము, పాపము) వినాశనము అయిపోతాయి. ఆత్మ తత్త్వ జ్ఞానము కలిగిన తరువాత చేసే ఏ కర్మ అంటదు. అలా అన్ని కర్మలు (పుణ్యము, పాపము) నివృత్తి అయిపోతాయి. ఆ కర్మ ఫలితములు (సుఖము, దుఃఖము) ఆ జీవుడికి ఏ సంబంధము ఉండదు. ఆ సాధకుడు మిగిలిన శేష జీవితము జీవన్ముక్తుడుగా గడుపుతాడు. ఆ శరీరము పడిపోయినప్పుడు కైవల్యము పొందుతాడు.

## 31. సర్వావరణమలాపేతస్య జ్ఞానస్త్యానంత్యాజ్ఞేయమల్పమ్

**తదా సర్వావరణ మలాపేతస్య జ్ఞానస్య ఆనంస్త్యాత్ జ్ఞేయమ్ అల్పమ్** - ప్రబలమైన వైరాగ్యముతో వివేక ఖ్యాతి మనస్సులో బలపడి, ధర్మ మేఘము అనే స్థితి కలిగిన తరువాత, మనస్సులో పేరుకొని ఆవరించి (కప్పివేసిన) ఉన్న అన్ని మాలిన్యములు తొలగిపోయి, మనస్సుకు జ్ఞానముతో అనంతమైన శక్తి కలిగి, జ్ఞేయమైన (తెలుసుకోవలసిన) వస్తువు తక్కువ స్థాయిలో ఉంటుంది.

ద్రష్ట (చూసేవాడు) కంటె దృశ్యము (చూడబడే వస్తువు) పెద్దది. ఎవరికైనా సరే వాళ్ళు

తెలుసుకోవలసిన విషయము చాలా పెద్దది. ఎంతో ప్రయత్నము చేస్తే కాని ఒక వస్తువు యొక్క సమగ్రమైన విషయము అన్ని కోణములలో తెలియదు. మానవులకు వస్తువులను తెలుసుకోవాలనే ఆసక్తి కలిగి, ఆ వస్తువు మీద మనస్సును కేంద్రీకరించి ఆలోచిస్తూ, క్రమక్రమముగా ఆ వస్తువు మీద కామముగా (కోరికగా) పరిణమిస్తోంది. ఆ కామమే (కోరికలే) క్రమక్రమముగా కర్మలను చేయిస్తోంది. ఆ కర్మలు ఫలితములను అందిస్తూ, జన్మలు కలిగిస్తున్నాయి. ఈ జన్మలకు మూల కారణము వస్తువు యొక్క పరిపూర్ణమైన జ్ఞానము కలగటలేదు. మానవులు వస్తువును చూసి, దాని అన్ని విషయములు తెలుసుకోవాలి అనే తపనతో, తనకు తెలియకుండానే, ఆ వస్తువు యొక్క జాలమునకు, వలయములోకి చిక్కుకుంటున్నాడు (Effects of Advertisements).

ప్రపంచములోని వస్తువులను, విషయములను ఆ, యా ఇంద్రియములు వాటితో ఇంద్రియములను నియంత్రించే మనస్సు కలిసి తెలుసుకుంటాయి.

**మైత్రేయోపనిషత్** - "**మనసా హ్యేవ పశ్యతి మనసా శ్రుణోతి మనసా సర్వాణినామాన్యభి వదతి**" – మనస్సే చూస్తుంది, మనస్సు వింటుంది. మనస్సు అన్నిటినీ తెలుసుకుంటుంది.

మనస్సు వేరే విషయము మీద ఆలోచిస్తూ ఉంటే, వస్తువు ఎదురు గుండా ఉన్నా చూడలేదు. కన్ను ఎంతవరకు ప్రసరించగలిగితే, మనస్సు కూడా కన్నుతో అంతవరకే ప్రసరించి ఆ వస్తువును చూడగలదు. మనస్సు ఆ వస్తువు వెనక భాగమును కూడా చూడలేదు. వస్తువుల సమగ్రమైన విషయములను మనస్సు ఎందుకు గ్రహించలేక పోతోంది?

మనస్సు స్వచ్ఛముగా ఉండుటవలన, ఆత్మ యొక్క ప్రతిబింబము మనస్సు మీద ప్రతిఫలిస్తోంది. మనస్సు తనలో ప్రతిఫలించిన ఆత్మ చైతన్యమును, వస్తువు మీదకు ప్రసరింపచేసి,, ఆ వస్తువు గురించిన విషయములను మనస్సు తెలుసుకుంటోంది. మనస్సులో ఇతర మాలిన్యములు (రజో గుణము, తమో గుణము, కామము, సంస్కారములు, రాగము, ద్వేషము, కోరికలు, కోపము, లోభము, మోహము, మదము, మాత్సర్యము మొదలైనవి) ఉండుటవలన, ఆత్మ చైతన్యము యొక్క ప్రతిబింబము పూర్తిగా గ్రహించలేక పోతోంది. ఎలాగైతే మబ్బులు సూర్య కిరణములను పూర్తిగా భూమి మీదకు పడకుండా ఎలా అడ్డగిస్తాయో, అదే విధముగా ఆత్మను ఆవరించి ఉండే తమో గుణము (అజ్ఞానము), ఆత్మ చైతన్య శక్తిని మనస్సు మీద పూర్తిగా పడకుండా అడ్డగిస్తోంది.

అందుచేత ఆత్మ బింబము మనస్సు మీద పూర్తిగా స్పష్టముగా ప్రతిబింబించుటలేదు. ఈ పరిస్థితిలో, రజో గుణము ఇంద్రియములను, మనస్సును బయటకు పోయేలా ప్రేరేపించి, ఇంద్రియములు వస్తువుల మీద, విషయముల మీద ప్రసరించినంత మేరకు మాత్రమే మనస్సు గ్రహించిన కొద్దిపాటి చైతన్య శక్తితో తెలుసుకొగలుగుతోంది. అప్పుడు తెలుసుకోగలిగే జ్ఞానము తక్కువగా ఉండి, జ్ఞేయము (తెలుసుకోబడే వస్తువులు, విషయములు) పెద్దవిగా ఉంటాయి. ఇంద్రియములు వస్తువుల వెనుక భాగములవైపు ప్రసరించలేని కారణముగా మనస్సు వస్తువుల సమగ్రమైన జ్ఞానము గ్రహించలేక పోతోంది. అందుచేత ఆ వస్తువుల సమగ్రమైన జ్ఞానము తెలుసుకోవాలనే ఆసక్తి మనస్సులో పెరిగి, పెరిగి క్రమక్రమముగా కోరికగా పరిణమిస్తోంది.

ఒకవేళ ఆకాశములో ఏ మబ్బులు లేకుండా, ఆకాశము పరిశుద్ధముగా ఉన్నప్పుడు సూర్య కిరణములు పూర్తి ప్రకాశముతో భూమి మీద పడినప్పుడు వస్తువులు ఎంత స్పష్టముగా కనిపిస్తాయో, అదే విధముగా మనస్సులో తమో గుణము, రజో గుణము ప్రభావము పూర్తిగా తొలగిపోతే, వాటి ద్వారా కలిగే సంస్కారములు, మలినములు (రాగము, ద్వేషము, కోరికలు, కోపము, లోభము,

మోహము, మదము, మాత్సర్యము మొదలైనవి) కూడా తొలగిపోయి, మనస్సు పూర్తిగా స్వచ్ఛముగా, పరిశుద్ధముగా ఉంటే, ఆత్మ చైతన్యము పూర్తిగా మనస్సు మీద ప్రతిఫలించి, ఆత్మ చైతన్యము యొక్క పూర్తి చైతన్య శక్తితో వస్తువుల, విషయముల సమగ్రమైన జ్ఞానము పొందగలుగుతుంది. అప్పుడు తెలుసుకోగలిగే జ్ఞానము అనంతముగా ఉండి, జ్ఞేయము (తెలుసుకోబడే వస్తువులు, విషయములు) అల్పముగా ఉంటాయి. అప్పుడు ఆ వస్తువుల, విషయముల మీద ఆసక్తి ఉండదు, వాటిమీద కోరికలు కలగవు.

## 32. తతః కృతార్థానాం పరిణామక్రమసమాప్తిగుణానామ్

**తతః కృతార్థానాం పరిణామక్రమ సమాప్తి గుణానామ్** – ప్రబలమైన వైరాగ్యముతో వివేక ఖ్యాతి మనస్సులో బలపడి, ధర్మ మేఘ సమాధి సిద్ధించిన తరువాత గుణముల ప్రయోజనములు పూర్తి అయిపోయినందున, మనస్సులో ఆలోచనల రూపములో ఉండే గుణములు కృతార్థత పొంది ఆ గుణముల పరిణామ క్రమము పూర్తిగా ఆగిపోతుంది.

వైరాగ్యముతో వివేక ఖ్యాతి కలిగిన మనస్సులో ఉండే ఆవరణ మలినములు అన్నీ తొలగిపోయి,

మనస్సు పరిశుద్ధమై మనస్సులో జ్ఞానము అనంతముగా ప్రతిబింబిస్తూ ఉంటే, జ్ఞేయము (ప్రాపించక వస్తువులు, విషయములు) అల్పముగా అయిపోయి, ధర్మ మేఘము ద్వారా అమృత ధారల వర్షముతో ముద్ద అవుతున్న సిద్ధుడు,అల్పమైన ప్రాపించక వస్తువులు, విషయముల మీద ఏ విధమైన కోరికలు, వాటి ద్వారా కలిగే భోగముల మీద ఏ విధమైన ఆసక్తి లేని స్థితి ఏర్పడినప్పుడు, ప్రకృతి యొక్క సత్త్వ, రజో, తమో గుణముల ప్రయోజనములు (1. సంసారిక భోగములు – సుఖము, దుఃఖము. 2. వైరాగ్యము, వివేక ఖ్యాతి, అపవర్గము – మోక్షము, భోగముల ముగింపు) పూరి అయిపోతుంది. వైరాగ్యము కలిగి సంసారిక భోగములు వద్దని నిర్ణయించుకున్నాడు కాబట్టి మొదటి ప్రయోజనము పూర్తి అయిపోయింది. భోగములకు విరుగుడుగా వైరాగ్యముతో వివేక ఖ్యాతి పొందాడు కాబట్టి రెండవ ప్రయోజనము కూడా పూర్తి అయిపోయింది. ఈ పరిస్థితిలో ప్రకృతి యొక్క మూడు గుణములకు ఏ పనీ లేదు, కాబట్టి గుణములు కృతార్థత (సఫలము, పని పూర్తి చేశాయి) అయిపోయాయి.

ఆ వ్యక్తిలో ఈ పరిస్థితి ఏర్పడిన తరువాత గుణములలో మార్పులు (ఒక గుణమును మరొక గుణమును అధిగమించాలనే పోటీ – కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ద్వేషము,

సంస్కారములు) ఆ వ్యక్తికి సంబంధించినంతవరకు సమాప్తము అయిపోతుంది.

ప్రకృతి యొక్క మార్పులు రెండు విధములుగా ఉంటుంది.

**1. అనులోమ పరిణామ క్రమము** – సృష్టి - మూల ప్రకృతి లేదా ప్రధానము (ప్రకృతి యొక్క మూడు గుణములలో నిరంతరము ప్రతి క్షణములో అతి సూక్ష్మమైన పరిణామములు, మార్పులు కలిగి) – మహతత్త్వము – అహంకారము – పంచ తన్మాత్రలు – పంచ భూతములు – శరీరము, మనస్సు, ఇంద్రియములు - వస్తువులు, విషయములు మొదలైనవి (ప్రపంచము) – ప్రయోజనము – భోగము (సుఖము, దుఃఖము).

**2. ప్రతిలోమ లేదా విలోమ పరిణామ క్రమము** – సృష్టికి వ్యతిరేక దిశ - వైరాగ్యము కలిగి భోగముల మీద ఆసక్తి పూర్తిగా తొలగిపోయి, ప్రకృతి యొక్క మూడు గుణములలోని పరిణామములు సమాప్తము అయిపోతాయి ప్రయోజనము – వివేక ఖ్యాతి, తత్త్వ జ్ఞానము, అపవర్గము.

## 33. క్షణప్రతియోగీ పరిణామాపరాంతనిర్గ్రాహ్యః క్రమః

**క్షణ ప్రతియోగీ పరిణామ అపరాంత నిర్గ్రాహ్యః క్రమః** - ప్రాపించక వస్తువులలో ఉండే గుణముల నిరంతరము పరిణామములు లేదా మార్పులు క్షణములతో ముడిపడి ఉంటుంది. ప్రతి క్షణ, క్షణములలో అన్ని వస్తువులలోను అతి సూక్ష్మమైన పరిణామములు కలుగుతూ ఉంటాయి. క్షణ, క్షణములలో జరిగే ఈ పరిణామముల సమాహారమును క్రమము అంటారు. ఎప్పుడైతే, ఎవరికైతే ఈ గుణములు కలిగించే భోగములు లేదా అపవర్గము కలిగించి, ఇంక చేయవలసినది ఏమీ లేని పరిస్థితి ఏర్పడినప్పుడు, ఆ గుణములు కృతార్థత పొంది, అప్పుడు ఈ గుణముల పరిణామ క్రమమునకు ఒక అంతము, ముగింపు కూడా ఉంటుంది.

త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి నుండి పుట్టిన ప్రపంచములోని ఏ వస్తువులోనైనా (ఆ వస్తువులోని గుణములు నిరంతరము క్షణ, క్షణము అతి సూక్ష్మమైన పరిణామములు నిరంతరము చెందుతూ) ప్రతి క్షణములో మన కళ్లకు కనిపించని చిన్న, చిన్న మార్పులు కలుగుతూ ఉంటాయి. ఒక శిశువు పుట్టిన తరువాత, ఆ శిశువు శరీరము క్రమక్రమముగా పెరుగుతూ ఉంటుంది. తరువాత బాల్య దశ, యవ్వనము, మధ్య వయస్సు, ముసలితనము. తరువాత ఈ మార్పులకు ఒక అంతిమ దశ వచ్చి

చివరికి మరణము (నాశనము) జరిగి ఈ పరిణామ క్రియ ఆగిపోతుంది. ఈ అంతిమ దశలో ఈ వస్తువులను మూల ప్రకృతి తనలో లయము చేసుకుంటుంది. ఈ ప్రపంచములోని ప్రతి వస్తువుకు ఈ పరిణామ క్రమము తప్పకుండా ఉంటుంది. కాని మూల ప్రకృతికి అంతిమ దశ అనేది లేదు. ఈ మార్పులు కలిగిన వస్తువులను అనిత్యము (అసత్యము) అని అంటాము. కాని మూల ప్రకృతికి పరిణామ క్రమము ఉన్నా, దానికి అంతిమ దశ లేదా అవసానము లేదు. అందుచేత మూల ప్రకృతి ఒక రకమైన నిత్యము (ఈ సృష్టిలోని అన్ని జీవులకు అపవర్గము కలిగే వరకు ప్రకృతిలో పరిణామ క్రమము ఉంటుంది). ఇది స్పష్టముగా చెప్పలేరు.

త్రిగుణాతీతమైన ఆత్మ స్వరూపమునకు ("**నేను**") ఈ పరిణామములు, పరిణామ క్రమము ఉండదు, అలాగే అంతిమ దశ లేదా అవసానము కూడా ఉండదు. అటువంటి ఆత్మ స్వరూపమును నిత్యము (సత్యము) అని అంటాము. కాని అజ్ఞానముతో (భ్రమతో) ఈ ఆత్మ స్వరూపమును ("**నేను**") శరీరముతో ముడి పెట్టేసి, శరీరమే నేను అనే భ్రమతో – "**నేను**" పుట్టాను, "**నా**" పుట్టిన రోజు, "**నేను**" పెరుగుతున్నాను, "**నాకు**" దెబ్బ తగిలింది అని అంటూ ఈ శరీరమునకు కలిగిన పరిణామములను ఆత్మకు ("**నేను**") అంటిస్తున్నాము. మనస్సులో ఉండే

రాగము (రజో గుణము) లేదా ద్వేషము (తమో గుణము) కారణముగా కర్మలు జరుగుతున్నా, జీవుడు ఆ కర్మలకు "**నేను**" కర్త అని భ్రమిస్తూ, ఆ కర్మలు తన బాధ్యత వహిస్తూ, ఆ కర్మ ఫలితములను అనుభవించుటకు, ఈ సంసార చక్రములో తిరుగుతూ ఉన్నాడు.

ఆకాశములో తెల్లని మబ్బులు కమ్మితే ఆకాశము తెల్లగా ఉంది అంటాము, నల్లటి మబ్బులు కమ్మితే ఆకాశము నల్లగా ఉంది అంటాము. ఏ మబ్బులు లేకపోతే (Space లో ఉండే సూక్ష్మమైన కణముల మీద సూర్య కిరణములు పడి ప్రతిఫలించేటప్పుడు నీలము రంగు అన్ని దిశలకు వ్యాపిస్తుంది. అందుచేత ఆకాశము నీలముగా కనిపిస్తుంది) నీలముగా ఉంది అని అంటాము. నిజానికి ఆకాశమునకు ఏ రంగు లేదు, అంటదు. స్వచ్ఛముగా ఉంటుంది. అదే విధముగా ఆత్మ స్వరూపమునకు శరీరము యొక్క ఏ లక్షణములు లేవు, అంటవు, ఏ పరిణామము లేదా మార్పు ఉండదు. ఆత్మ స్వరూపము కూటస్థ నిత్య జ్ఞాన స్వరూపము – ఎల్ల కాలములలోను ఏ పరిణామములు లేని నిత్య (సత్య) స్వరూపము.

### 34. పురుషార్థశూన్యానామ్ గుణానామ్ ప్రతిప్రసవః కైవల్యమ్ స్వరూపప్రతిష్ఠా వా చిత్తశక్తిరితి

**పురుషార్థ శూన్యానామ్ గుణానామ్ ప్రతిప్రసవః కైవల్యమ్ స్వరూప ప్రతిష్ఠా వా చిత్తశక్తిః ఇతి** -

**పురుషార్థ శూన్యానామ్ గుణానామ్ -** త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి యొక్క మూడు గుణములకు (సత్త్వ గుణము, రజో గుణము, తమో గుణములకు) ఎప్పుడైతే పురుషుడి (జీవాత్మకు) అందించవలసిన (భోగము లేదా అపవర్గము) పూర్తి అయిపోయినప్పుడు

**ప్రతిప్రసవః కైవల్యమ్ –** ఈ మూడు గుణములు తమకు మూలమైన మూల ప్రకృతిలో ఐక్యమైపోతాయి (లయమైపోతాయి). గుణముల ప్రభావము లేని పరిస్థితిని కైవల్యము అంటారు. లేదా

**స్వరూప ప్రతిష్ఠా వా చిత్తశక్తిః ఇతి**– ఆత్మ స్వరూపము యొక్క చైతన్య శక్తి, తన స్వస్వరూపములో (వేరే స్వరూపముతో కలిసి ఉండకుండా) భాసిస్తూ లేదా ప్రకాశిస్తూ ఉండే స్థితిని కైవల్యము అంటారు. దీనిని మించి ఇంకేమీ లేదు.

కైవల్యమును రెండు విధములుగా అర్థము చేసుకోవచ్చు. 1. మూడు గుణములకు పురుషుడితో ఏ పనీ లేక పరిణామ క్రమము అంతము

అయిపోయినప్పుడు. 2. ఆత్మ స్వరూపము తన స్వస్వరూపములో భాసిస్తూ ఉన్నప్పుడు.

తన స్వస్వరూపమును కోల్పోయిన పురుషుడికి, మూల ప్రకృతితో కలిసి ఉండి, మూల ప్రకృతే తాను అనే భ్రమలో ఉండే పురుషుడికి, ఆ మూల ప్రకృతి ద్వారా జరిగిన కర్మలు తానే చేసుకున్నానని భ్రమతో, ఆ కర్మల బాధ్యత వహిస్తున్న పురుషుడికి, ఆ కర్మ ఫలితములను (భోగములు – సుఖము, దుఃఖము) అందించుటకు సృష్టిని ప్రారంభిస్తుంది. సృష్టి క్రమము - మూల ప్రకృతి – మహతత్త్వము – అహంకారము – పంచ తన్మాత్రలు – పంచ మహాభూతములు – అంతఃకరణము (బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము) మరియు దృశ్య ప్రపంచమైన వస్తువులు, విషయములు. జీవాత్మకు ఆ కర్మల కారణము యొక్క భ్రమ, అజ్ఞానము ఉన్నంత వరకు, మూల ప్రకృతి ఈ సృష్టి ప్రక్రియ నిరంతర పరిణామ క్రమముగా నడిపిస్తూ ఉంటుంది.

అవిద్యతో ఆవరించబడి ఉన్న పురుషుడు పరిణామ క్రమములో ప్రధానమైన మనస్సుతో మమేకమైపోయి, మనస్సే "**నేను**" అని భ్రమిస్తూ, ఆ మనస్సును ఆధారముగా చేసుకొని, దృశ్య ప్రపంచమును దర్శిస్తూ, "**నేను ద్రష్ట**" అని భ్రమిస్తూ, మనస్సు చేసే కర్మలను "**నేను" కర్త**" అని భ్రమిస్తూ,ఆ

దృశ్య ప్రపంచము ద్వారా భోగములను అనుభవిస్తూ **“నేను భోక్త”** అని భ్రమిస్తున్నాడు. దీనికి మూల కారణము పురుషుడు మనస్సుతో కలిసిపోయి, తనకు త్రిగుణాత్మకమైన మనస్సుకు ఏ బేధము లేదని భ్రమ (అవిద్య).

పురుషుడికి తన స్వస్వరూపము చైతన్య స్వరూపమని, త్రిగుణాత్మకమైన ప్రకృతి ద్వారా కలిగిన మనస్సుతో, ప్రాపించక వస్తువులు, విషయములు వేరు అనే వివేకము కలిగిన తరువాత, ఈ వివేకము కలిగించటమే తమ ప్రయోజనముగా ఉండే మూడు గుణములు, తమ పని పూర్తి అయినట్లు (కృతార్థత) భావించి, తాము ఆ పురుషుడికి చేయవలసినది ఇంకేమీ లేదు కాబట్టి, తమ మూల కారణమైన మూల ప్రకృతిలో లయమైపోతాయి. ఏ మనస్సుతో ఇంతవరకు కలిసిపోయి, ఆ మనస్సు నేను అని పురుషుడు భ్రమపడుతూ భోగములను అనుభవిస్తున్నాడో, ఏ మనస్సులో ఎన్నెన్నో సంస్కారములు, రాగములు, ద్వేషములు మొదలైన మలినములను దాచుకొనిఉన్నాడో, ఏ మనస్సుతో సాధన చేసుకొని వివేక ఖ్యాతి పొందాడో, ఆ మనస్సు తన మూల కారణమైన మూల ప్రకృతిలో లయమైపోయి (ప్రతిప్రసవము అయిపోయి), మరలా ఆ

మనస్సు తిరిగి పుట్టదు. ఆ పురుషుడికి ఆ మనస్సుతో విముక్తి లభిస్తుంది.

ఇంతవరకు ఆత్మ స్వరూపమును ఆవరించి ఉన్న లేదా అడ్డముగా ఉన్న మూడు గుణముల యొక్క ఆవరణ తొలగిపోయి, దృశ్య ప్రపంచముతో సంబంధము కూడా తొలగిపోయి ఆత్మ స్వరూపము యొక్క చైతన్య శక్తి, మనస్సును, వృత్తులను ఆశ్రయించుకోకుండా, కేవలము ఏకముగా తన స్వస్వరూపములో భాసిస్తూ ఉంటుంది. ఇదే కైవల్యము. ఆ కైవల్యములోనే పరిపూర్ణమైన ఆనందము ఉంది.

## కైవల్య పాదము సమాప్తము.

### శ్రీకృష్ణ ప్రార్థన

**వసుదేవసుతం దేవం, కంసచాణూర మర్దనమ్।**
**దేవకీ పరమానందం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

### అథ క్షమా ప్రార్థనా

**యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।**
**తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తుతే ॥**

## అధ భగవత్ సమర్పణమ్

కాయేన వాచా మనసేంద్రియైర్వా బుధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్ ।
కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి ॥

## అధ లోకక్షేమ ప్రార్థనా

సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిత్ దుఃఖభాగ్భవేత్ ॥

## అధ మంగళమ్

శ్రియః కంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।
శ్రీవేంకట నివాశాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

## కృష్ణ నామ సంకీర్తన

కృష్ణం వందే జగద్గురుం । శ్రీ కృష్ణం వందే జగద్గురుం ।
కృష్ణం వందే జగద్గురుం । శ్రీ కృష్ణం వందే జగద్గురుం ।